# మంచు ముత్యాలు

[మాధుర గీతాలు]







పి. దుర్గారావు, యం.ఓ.యల్.

ముప్పదినాల్గవ పూజా పుష్పము

# మంచు ముత్యాలు

[మధుర గీతాలు]






రచన:

పి. దుర్గారావు, యం.ఓ.యల్.

ప్రథమ ముద్రణము :

400 ప్రతులు

సర్వస్వామ్యములు రచయితవి.

శ్రీ భావనాను సంవత్సరము
హేమంతము - పుష్యమాసము

1995 - జనవరి



వెల : రు. 12-00

ముద్రణము :
దుర్గాభవాని ప్రింటర్స్, విజయవాడ - 2

ప్రతులకు :

పి. దుర్గారావు, యం.ఓ.యల్.
చెరుకుపల్లి పోస్టు, (వయా) నక్రేకల్
నల్లగొండ జిల్లా.

# వినయ వాక్యము

"మంచు ముత్యాలు" అను మధుర భక్తి గీతాల పుస్తకమును ముప్పది నాల్గవ పూజా పుష్పముగా తెలుగు సాహితీ సరస్వతీ శ్రీ చరణార విందములకు భక్తి పూర్వక ముగా సమర్పించుకొనుచున్నాను.

ఉపాధ్యాయ వృత్తిని నిర్వహించుకొనుచు, అప్పు డప్పుడు భక్తి భావముతో వ్రాసికొనినవి యీ గీతములు. మధుర భక్తితో మనోహరముగా వ్రాసికొనిన మీరా బాయి భక్తిగీతాలు, కీ. శే. శ్రీ దేవులపల్లి కృష్ణశాస్త్రిగారి మధుర భక్తి గీతాలు, విశ్వకవి రవీంద్రనాథ ఠాకూర్ గారి గీతాంజలి నా యీ భక్తి గీతములకు ప్రేరణయని చెప్ప వచ్చును.

శ్రీకృష్ణ పరమాత్మను నాయకునిగా జేసికొని మధుర గోపికగా భక్తితో రచించిన యీ పుస్తకమును శ్రీకృష్ణుని చరణారవిందములకే సమర్పణము గావించుకొను చున్నాను.

ఇందు నాయకునిగా వర్ణింపబడిన శ్రీకృష్ణుడు మురళీ లోలుడేగాక, పరబ్రహ్మ స్వరూపముగాను, ఇందలి గోపికా విరహము పరమేశ్వరుని యందు లీనమగుటకు జీవి యొక్క వేదనా పూర్వకమైన ప్రార్థనగాను భావింపవలెను.

ఇదివఱలో ప్రచురించిన లలిత గీతములను ప్రశంసించుతూ పత్రికలు, ప్రముఖులు ప్రశంసించి యున్నారు. వారికినా యభివందనములు. ఇదే విధముగా మఱికొన్ని పుస్తకములు వ్రాయవలెనని నా యాకాంక్ష.

ఈ పుస్తకమునందు గల గీతములు పాడుకొనుటకు వీలుగా లలిత పదములతో గుదిగ్రుచ్చబడినవి. మంచు కాలమైన యీ హేమంతంలో కొన్ని పదములు రచింపబడినందున, అందువలన యీ పుస్తకమునకు మంచుముత్యాలు అని పేరు బెట్టబడినది. రస హృదయుల నే మాత్రము స్పందింప జేసినను ధన్యుడిగా భావించుకొందును.

—రచయిత.

# సమర్పణ

ఎన్ని మారులు పాడినా
వన్నె తరుగదు నీ పాటకు!
ఎన్ని మారులు విన్నా నీ మురళీ స్వనాలకు
వన్నె లేమీ తరుగవు గదా!
మఱచి పోవాలన్నా మాధవా!
మఱవు రాదు నీ పేరు!
విడిచి పోవాలన్న వీడిపోదు
విడివడని బంధ మిది యేనాటిదో!
తీయని నీ మురళి పాట
తీపిదనం కురిపిస్తుం దెప్పుడూ!
నర్తన జేస్తుం దెప్పుడూ నా యెదలో
నవ్య సుందరములను వెలువరిస్తూ!
అందుకే అర్పిస్తున్నా
ఆత్మార్పణమని!
ఆ వేదనతో నా మధుర గీతాలను!
యుగయుగాలనాటి పై మధుర పదాలు!
తరతరాల నాటి దీ హృదయ వేదన!

మంచు ముత్యాలు

# మాతృ వందనము

ఓహో! నా జన్మభూమి! ఓహో! నా మాతృభూమి!
ఓహో! నా కన్నతల్లి వందన మిదె ప్రియభారతి!
ఓహో! నా జన్మభూమి! ఓహో! నా మాతృభూమి!

సకలసస్య శ్రీనిలయిని! సాధుమార్గ శుభదాయిని!
సర్వలోక జనపూజిత! సామగాన సురభాషిణి!
సకలధర్మ సహజీవన సంస్కృతి విలసిత శోభిని!
పుణ్యకర్మ సువిరాజిత పూర్ణకలా తేజోమయి!

గంగ యమున గోదావరి కావేరి కృష్ణవేణి!
ఉన్నత హిమగిరి శిఖరము లొప్పెడు శుభకల్యాణీ!
అడుగడుగున పుణ్యభూము లమరు విమల సౌమ్యమూర్తి!
మధుర కావ్యగేయ శిల్ప మంజులతర శివగాయని

సత్యము శివ సుందరములు సర్వదిశలు విలసిల్లిన
ఈ సుందర కర్మభూమి! యీ పవిత్ర దివ్యధాత్రి!
నీ స్వరూప విలసనమే! నీ యనంత దర్శనమే!
ఆమ్మా! నీ యాశీస్సులు సలరి వేడుచుంటి నమ్మ!

ఓహో! నా జన్మభూమి! ఓహో నా మాతృభూమి!
ఓహో! నా కన్నతల్లి! వందనమిదె ప్రియభారతి!
ఓహో! నా జన్మభూమి ఓహో నా మాతృ భూమి!

# దేవతా వందనము

వాణీ వీణాపాణీ! వందిత జన సకలలోక!
కామిత విద్యాప్రసన్న! కళ్యాణీ! శుభదాయిని!
వాణీ! వీణాపాణీ! వందిత జన సకలలోక!

యోగివంద్య జ్ఞానజ్యోతి! సారస్వత స్వాదురూప!
మృదుపద సుందరభావన! కవికులజన వరదాయిని!
విశ్వరూప! విమలచరిత! అక్షరరూపిణి భారతి!
లలిత లలిత పదశోభిని! లాలిత సుందరభాషిణి!

ఉదయసంధ్య అరుణారుణ రేఖాంకిత సదయనేత్రి!
కరుణామయి! కావ్యగేయ గాన కళా సుప్రసన్న!
అజరుద్రాచ్యుత పూజిత! ఆదిరూప! సుఖదాయిని!
బుధసేవిత! ధవళవర్ణ! భూరికృపానందలహరి!

లలితకళానందమూర్తి విలసిత చైతన్యమూర్తి!
మానవ విజ్ఞాన భాండ మధుర సుధా కలశహస్త!
శివరూపిణి! ప్రణవనాద! తేజోమయి! దీపరేఖ!
అఖిల జీవకోటి హృదయ! ఆనందిని! శ్రీదుర్గా!

వాణీ! వీణాపాణీ! వందిత జన సకలలోక!
కామిత విద్యాప్రసన్న! కల్యాణీ! శుభదాయిని!
వాణీ! వీణాపాణీ! వందిత జన సకలలోక!

# కల్యాణి శ్రీదుర్గ

కల్యాణి శ్రీదుర్గ! కరము వేడుచునుంటి
కనులార! నను జూచి కాచి రక్షింపు!

ఆర్ద్ర భావముతోని యరసి కాపాడుమా!
తీయనీ పలుకుతో తీరుగా దయతోని!

కల్యాణి శ్రీదుర్గ! కరము వేడుచునుంటి!
కనులార ననుజూచి కాచి రక్షింపు!

అడుగడుగు నందునను నమృత వాక్కుల నిచ్చి
మధురాతి మధురమా మధుర భావములిచ్చి!
సంగీత సాహిత్య సరసమా గీతికల
నా నోట బలికింపు నవ్యసుందరములను!

కొండ కోనలయందు కోకిలలు బాడినటు!
సెలయేటి జాలులటు! జిఱుగాలి తరగలటు!
ఉదయ సంధ్యలలోని కదిలేటి కాంతులటు!
నా గొంతు రాగాల నవ్యతల దొలికించు!

లలిత కళలను నిచ్చి లాలిత్యమును గూర్చి
విభుని వశబఱచుకొను విమలతను దయచేయి!
శ్రీమురళి జేరుకొను శ్రీని దయజేయుమా!
పాటలో పాటనయి వల్లవిని యగునటుల!

కళ్యాణి శ్రీదుర్గ! గరము వేడుచునుంటి
కనులార జూచి ననుగాచి రక్షింపు!

# మంచు ముత్యాలు

(మధుర గీతాలు)

మంచు ముత్యాలతో మధురపదముల జేర్చి
మంజులంబగు గీతి మాధవా! కూర్చితిని!
వినిపింతు రావోయి వీనులకు విందుగా
అల గోపికలు నాడు యాడి పాడినరీతి!
మంచుముత్యాలతో మధురపదములు జేర్చి
మంజులంబగు గీతి మాధవా! కూర్చితిని!

రవి కాంతికిరణాల రమ్యమగు రంగులను
తనయందు గలుపుకొని తన్మయంబగునటుల;
మంచు ముత్యాలవలె మధురమగు నీ సొగసు
నాలోన గలుపుకొని నాట్యమాడెద కృష్ణ!

తెల్లనీ వెన్నెలల తెలిపూల రేకలను
ఒకటొకటి జార్చుచూ వొయ్యార మొలికినటు!
మంచుముత్యాలవలె మనసులో భావాలు
విమలగీతము బాడి వినిపింతు నొకటొకటి!

హేమంతఋతువులో హిమబిందువులవోలె
సృష్టి యందాలన్ని జేర్చుకొని తమయందు
మాయమైనటుల నే మాయమైపోయెదను
నీ సొగసులన్నియు నిలుపుకొని శ్రీకృష్ణ!

మంచుముత్యాలతో మధురపదముల జేర్చి
మంజులంబగు గీతి మాధవా! కూర్చితిని!

# మాలిన్యములు లేని

మాలిన్యములు లేని మగువ నే శ్రీకృష్ణ!
తెల్లనీ పాలవలె తెలిమబ్బు అంచులా!

చంద్రకిరణమువోలె నింద్రధనుసుకు మల్లె
మంచిమనిషికి వున్న మనసువలె మాధవా!

మాలిన్యములు లేని మగువ నే శ్రీకృష్ణ!
తెల్లనీ పాలవలె తెలిమబ్బు అంచులా!

జన్మింపలేదు నే జగతిలో నెవరికిని
ఆరుబయలున బుట్టి యలరితిని లోకమున!
అందాలవన్నియును నలరె దామేవచ్చి
సృష్టియందాలన్ని చోద్యముగ వనుగూడె!

తపియించుచుంటినీ తపసివలె నినుగనగ
చిగురుపూవులపైన చిత్రముగ ధరణిపై!
గరికపూవులపైని కమనీయ రూపమున
మానగీతముతోని మైమఱచుచుంటినీ!

ముద్దుగా స్పృశియింపు మోహనా! మురళితో
చిట్టి వేల దాకుమా చిన్నారి నామోము!
నీ యంగుళీయమున నీటుగా ధరియింపు
జాతి ముత్యమువోలె ప్రీతినిండారగా!

మాలిన్యములు లేని మగువ నే శ్రీకృష్ణ!
తెల్లనీ పాలవలె తెలిమబ్బు అంచులా!

# గరికపూవున నిలిచి

గరికపూవున నిలిచి గగనమును గాంచుచూ
నీ రాకకై వేచి నిలిచితిని కృష్ణా!
రవి కిరణములు సోకి రాలిపోవకముందె
నీ కాంతిరేఖలను నిలుపుకో కృష్ణా!
గరికపూవున నిలిచి గగనమును గాంచుచూ
నీ రాకకై వేచి నిలిచితిని కృష్ణా!

మంచుముత్యము నేను మహనీయ భావమున
మౌనమున నిను బిలిచి మాటాడుచుంటినీ!
మౌనభాషను వినుము! మౌనవేదన గనుము!
నీ కాంతి కిరణాన నిలుపుకో శ్రీకృష్ణ!

చందురునిలో బుట్టి జేరితిని సొగసుగా
అందాల ధరణిపై యలరితిని గరికపై!
ముత్యమనుకొందురూ మునులు ఋషులూ నన్ను
మురిపెమున ననుజూచి మూర్ఛపోదురు కవులు!

సంజకెంపులు అవిగో! సరసముగ నాయందు
నీడగనుచును మిగుల నీటుగులుకుచు నుండె!
రవి రాకముందుగా రావలెను పరమాత్మ!
కలుపుకోవలె నీదు కమనీయ జ్యోతిలో!

గరికపూవున నిలిచి గగనమును గాంచుచూ
నీ రాకకై వేచి నిలిచితిని కృష్ణా!

# ముత్యాలహారమును

ముత్యాలహారమును ముద్దుగా ధరియించి
మురిపాలు జిందేవు! మోమంత వికసింప!

రంగురంగులలోన రమణీయ ముత్యమును
సన్నేల ధరియింప వదియేల శ్రీకృష్ణ!

ముత్యాలహారమును ముద్దుగా ధరియించి
మురిపాలు జిందేవు! మోమంత వికసింప!

సృష్టియందాలన్ని చేరినవి కనుగొనుము!
నీలియాకాశమును నిలిచినది నాయందు!
పచ్చనీ తరులన్ని పరిమళించెను గనుము!
చంద్రకాంతులు గూడ యింద్ర వైభవముతో!

రంగురంగుల పూలు రమణీయ కాంతులను
నాలోన వికసించె నన్య సుందరములయి!
రాజహంసలు వచ్చి రమణీయముగ నన్ను
మోము నద్దకముందె మోహనా! గ్రహియింపు!

పసిబాలురందఱును పరుగుబరుగున వచ్చి
రంగు ముత్యంబనుచు జెంగుచెంగున యెగిరి!
చిరుజేతులను నన్ను జెఱిపి వేయకముందు
ముత్యాలదండలో మురిపెముగ ధరియింపు!

ముత్యాలహారమును ముద్దుగా ధరియించి
మురిపాలు జిందేవు! మోమంత వికసింప!

# ఇటునుంటినో ప్రభూ!

ఇటనుంటినో ప్రభూ! యిలపైని గరికపై
చిన్నిపూవులపైని సింగారములు జింద!
మౌనగీతమును విని మనసంత కఱుగగా
నను వెదుకుచుంటివా? నాథ యీ ధరణిపై!
ఇటనుంటినో ప్రభూ! యిలపైని గరికపై
చిన్ని పూవులపైని సింగారములు జింద!

నీలిమేఘముపైని నిలిచి యుండగలేదు
అందాలమేడపై యలరి యుండగలేదు!
రాజభవనములలోని రమణీయ రమణులా
పాటను నిలిచి నే పరవశము కాలేదు!

సంధ్యాకాంతులలోన సరిగమల రాగాల
అత్తరుల వాసనల చిత్తరువులందాల!
రక్తి నిలువగలేదు రమ్య వేదికలందు
ఆడిపాడేటి యా యంగనామణులందు!

తినుట కన్నము లేని దీనులగు బీదలా
పూరిగుడిసెలముందు బొలుపుగా గరికపై!
నిలిచియుంటిని స్వామి నీ గీతి పాడుతూ
మంచుముత్యముగ నే మహినుంటి కనుగొనుము!

ఇటునుంటినో ప్రభూ! యిలపైని గరికపై
చిన్నిపూవులపైని సింగారములు జింద!

# రవికాంతి సోకినా

రవికాంతి సోకినా రమ్య మంచువులవలె
మనసంత విరిసెనే మధురభావాలూ!

ఏ మధురభావాలన్నీ మంచుకాలాన
సుందరంబగు గీతి సుదతి గుదిగ్రుచ్చునో?

రవికాంతి సోకినా రమ్య మంచువులవలె
మనసంత విరిసెనే మధురభావాలూ!

కమనీయమైన యొక కాంతికిరణములాగు
కంటికగుబడుచుండె కాంతరో! నా విభుడు!
వినిపించుచుండెనే విమలమగు నాదాలు
మనసంత మారెనే మల్లెపువ్వుకు మల్లె!

అలలలో ముత్యాలు నలరినటు గనిపించె
చుక్కలన్నీ దావు కొచ్చినటు భాసించె!
వనవీధి పూలన్ని వరుసగా ననుజుట్టి
హాస్యాలు సలిపినటు యంతరంగం బలరె!

మంచుబిందువులన్ని మధురాక్షరములాయె
అలలలో ముత్యాలు అందాలపదములై
నా తోట పూలన్ని నవ్యగీతికలాయె
పాడుచుంటిని సఖి! ప్రణయమున తూలుతూ!

రవికాంతి సోకినా రమ్య మంచువులవలె
మనసంత విరిసెనే మధురభావాలూ!

# హేమంతమైతి నే!

హేమంతమైతి నే! హిమబిందువై తి నే!
కంటిముత్యాలు నే కడలి గలిపితినీ!
విభుని విరహాముతోని వేదనను జిమ్ముతూ
మంచుపొగలకువోలె మారితిని చెలియా!

హేమంతమైతి నే! హిమబిందువై తి నే!
కంటి ముత్యాలు నే కడలి గలిపితినీ!

విరహాగ్నిజ్వాలలే వెల్లివిరిసెను ధాత్రి!
తెలిమంచు పొగలవలె దేలుచున్నది నింగి!
భువియంత తడిసినది పొలుపార కన్నీట
చిన్నారి గరికలును పొన్నారి పూవులును!

తెల్లనీ తెరలతో తెరలువేసితి చెలియ!
మాధవుడు దా వచ్చి మఱలిపోకుండగను!
పచ్చనీ పచ్చికల విచ్చినా పూలపై
నిలిచి జూచుచునుంటి నీరజాక్షుని జాడ!

ఆరుబయలున నిలిచి యతనికై నే జూడ
మంచుముత్యాలతో మఱి మోమునిండినది!
కలువగా మారితిని కమనీయపద్మముగ
హంసవలె తెల్లగా నలరుచుంటిని సఖి!

హేమంతమైతినే! హిమబిందువై తి నే
కంటిముత్యాలు నే కడలి గలుపుచునుంటి

## కడలి తీరమునందు

కడలి తీరమునందు గల ముత్తెముల నేరి
సమకూర్చితిని స్వామి! చక్కనీ దండగా!

హృదయమున ధరియించి వేదనను మాన్పుమా
వేయిజన్మలగీతి విని యాదరింపుమా!

కడలి తీరమునందు గల ముత్తెముల నేరి
సమకూర్చితిని స్వామి! చక్కనీ దండగా!

కడలియంచున జేరి కడలేని వేదనను
కన్నీటి భాష్పాల గలిగినవి ముత్యాలు!
స్వాతి ముత్యాలతో జతజేర్చి కట్టినది
కమ్మనీ గీతాల కావ్యగానము జేయు!

తెల్లనీ ముత్యాలు దెలుపు నా వలపులను
నల్లనీ ముత్యాలు నాథ! దెలుపును వ్యధను!
పచ్చనీ ముత్యాలు పాతివ్రత్యము దెలుపు
నీలిముత్యాలు నా నిర్మలత్వము దెలుపు!

ముత్యాలసరమిదిగో! ముద్దుగా గూర్చితిని
వైజయింతిని సరస వన్నెలాడ! ధరింపు!
వలపులన్ని దెలుపు లలిత ముత్తెములన్ని
వేదనల రోదనల విరహబాధల నన్ని!

కడలితీరమునందు గల ముత్తెముల నేరి
సమకూర్చితిని స్వామి! చక్కనీ దండగా!

## కనిపించునా నాటి

కనిపించునా నాటి కమనీయ రూపాలు!
వినిపించునా నాటి విమల గీతాలూ!

మధురమగు శ్రీమురళి మాధుర్యనాదాలు
మఱల నే విందునా? మధురిమలు పొంగార!

కనిపించునా నాటి కమనీయరూపాలు!
వినిపించునా నాటి విమలగీతాలూ!

ఆలమందలమేపు ఆనాటి యందాలు
చిన్ని పెదవులపైని చిందినా చిఱునగవు!
నెమిలిపింఛపు సొగసు నెమ్మోము కళలనూ
మఱల నే జూతునా మనసు గోరికదీర!

ఘుమ్మనుచు గవ్వమును గూర్చి నే మథియింప
దధిభాండమును జేరి దగబట్టి కవ్వమును!
వెన్న బెట్టినగాని విడువనని బలికేటి
చిన్నికృష్ణుని చిలిపిచేష్టలిక కందునా?

ఆనాటి యాటలపు ఆ పిలుపులన్నియును
ఎటుబోయెనో చెలియ! చటుల వేగముతోని!
ఈనాడు జరిగినటు! యిపుడిపుడు జరిగివటు
కలయందునా? లేక కాదు నిజమందునా?

కనిపించునా నాటి కమనీయరూపాలు
వినిపించునా నాటి విమలగీతాలూ!

# కమనీయ భావాలు

8

కమనీయ భావాలు కడలి తరగలవోలె
కదిలిపోవుచునుండె కనుచూపు దూరముగ!

మధురగీతికలెన్నొ మదియందు పులకించి
పూలవలె వికసించి పుడమి రాలుచునుండె!

కమనీయ భావాలు కడలి తరగలవోలె
కదిలిపోవుచునుండె కనుచూపు దూరముగ!

గగనాన చుక్కలవలె కనిపించి క్షణములో
తెలిమబ్బు క్రమ్మగా తెలతెలా బోయినటు!
నా మనసు భావాలు నవనీత గీతాలు
ఉదయించి మరుక్షణము మదియందు మాయమగు

వాసంత శిశిరములు వరుసగా ఋతువులవి
నవరంగులను విరిసి నాట్యమాడుచు మదిని
కనిపించిపోయినటు కమలాక్షు భావాలు
తరలిపోవుచునుండె దన్మయంబగుచుండ!

ఏ మధురభావాన యేపాట పాడుదును?
ఏ రాగతాళాల నెంచుదును గైకొనగ!
లక్షదీపాలతో లలన! నే దేవికో
నీరాజనంబిత్తు నింపుగా మాధవుకు?

కమనీయభావాలు కడలి తరగాల వోలె
కదిలిపోవుచునుండె కనుచూపు దూరముగ!

## కాంతునకు నాపైని

కాంతునకు నాపైని గల ప్రేమ యింతయని
వివరింపగాలేను వేయిమాటలనూ!

అతనిపై నా వలపు నంతయని చెలియరో
వేయి గీతికలలో విప్పి జెప్పగలేను!

కాంతునకు నాపైనిగల ప్రేమ యింతయని
వివరింపగాలేను వేయిమాటలనూ।

మంచుకొండంత మా మధురప్రేమకు కొలత
ఇంతయౌన తరుగదూ యింపైన మాప్రేమ!
కడలితరగల వోలె గదులుచుండు నదేపుడు
హంసజతవలె నింగి యులరి పయనించునూ!

పుడమి రేణువులన్ని పోలుపైన మాటలను
చుక్కలెన్నోయన్ని చక్కనీ గీతాల!
మధురాక్షరములతో మానినీ! తెలుపగను
అలశేషుడే తగును నాలపింపగ కవిత!

అతడెంత ప్రేమించు నంతకును రెట్టింపు
వలతు నే కృష్ణునీ వరుసగా నతడునూ!
నా వలపు దీవులకు నాతి రెట్టింపైన
వలపులను గురిపించు వర్ణింపలేరెవరు!

కాంతునకు నాపైనిగల ప్రేమ యింతయని
వివరింపగాలేను వేయి మాటలనూ!

## మాయలన్నీ తెలియు

మాయలన్నీ తెలియు! మర్మమంతా తెలియు!
కొంటెపనులన్నియును గోపాలకృష్ణా!
మంచుకాలాన యీ మాధుర్య మదియేల
కోకిలారాగాల కోనలో పాటేల?

మాయలన్నీ తెలియు! మర్మమంతా తెలియు!
కొంటెపనులన్నియును గోపాలకృష్ణా!

చల్లనీ మంచులో చందమామకు మల్లె
చలియించుచుంటినీ తెలిమేని ముసుగులో!
కోనలకు పయనించి కోరికెటు దీర్చుదును?
విమలమగు నాగీతి వినిపింతు శ్రీకృష్ణ?

మంచుతెరలోనున్న మహిమాన్విత శిల్పముగ
కొలకులో గలువగా గూర్చియుంటిని స్వామి!
మంచుముత్యాలపై మధురముగ నడుగిడుచు
బరుగిడుచు రాలేను బాంధవా క్షమియింపు!

నీవె రావలె స్వామి! నీటుగా దాపునకు
కోనలో వేణువును గొనరి పాడుటయేల?
అందాల నాగీతి యాడుతూ పాడుతూ
వినిపింతు రారమ్ము వీనులకు విందుగా!

మాయలన్నీ తెలియు మర్మమంతా తెలియు
కొంటెపనులన్నియును గోపాలకృష్ణా!

## వెల్లువగ ప్రవహించు

వెల్లువగ ప్రవహించు విమలమగు ప్రేమలో
స్నానమాడకపోతి సఖియరో నాడూ!

మనసు మనసూ కలిపి మాటమంతీతోని
మాధవుని వశబఱచుకోనైతి సఖియా!

వెల్లువగ ప్రవహించు విమలమగు ప్రేమలో
స్నానమాడకపోతి సఖియరో నాడూ!

అందాలభామనని యాటక త్తియ ననుచు
అటుపోతి యిటుపోతి యతని ప్రేమను ద్రోసి
విలపించుచుంటినే వేయి వేదనలతో
అలనాటి కథల నే నాత్మలో స్మరియించి!

మఱచిపోతిని యతని మాధుర్యమును గూడ
మైదానములయందు మసిలితిని కోరికల!
పాట మఱచితి యతనిమాట మఱచితిని చెలీ
అందాలరూవు నాయాత్మలో శెరిగినది!

మఱచిపోయిన గీతి మఱల నెటు పాడుదును?
చెఱిగినా చిత్రమెటు జిత్రింతు రంగులను?
శిథిల శిల్పమున కెటు జీవమును బోయుదును?
వాడినా పూమాల వన్నెలెటు జతకూర్తు?

వెల్లువగ ప్రవహించు విమలమగు ప్రేమలో
స్నానమాడకపోతి సఖియరో నాడూ!

## విశ్వమంత నీ

విశ్వమంత నీ విమల రూపమును
కన్నులగాంచే కమనీయంబగు!
మనసునిచ్చి నను మన్నన జేయుము
చిన్నికృష్ణ నిను చేరగనిమ్మా!
విశ్వమంత నీ విమల రూపమును
కన్నులగాంచే కమనీయంబగు!

అణువు అణువునను అలరు నీ సొగసు
అఖిలమంత నీ సుందర మేకద!
గాలి తెమ్మెరల కదిలే పూవుల
కదలికలన్నియు నీ చిఱునవ్వులు!

తొలి మలికాంతుల తోరవు సంజలు
శారదరాత్రుల చంద్ర కిరణములు
నీలి గగనమున నిలిచిన తళుకులు
నిర్మలమగు నీ యడుగుల నీడలు!

కొండకోనలో కోకిల పాటలు
సెలయేఱులలో చిత్రనాదములు
విశ్వగోళముల విమలనాదమేదో
అది నీ మురళీ యంత ర్వాహిని!

విశ్వమంత నీ విమలరూపమును
కన్నులగాంచే కమనీయంబగు
మనసునిచ్చి నను మన్ననసేయుము
చిన్నికృష్ణ! నిను చేరగనిమ్మ!

# నా పాటలో నీవు

నా పాటలో నీవు నాదమై మెదలాలి
నీ మురళిలో నేను నిస్వనం బవ్వాలి!

నీపాట నాపాట నిఖిల విశ్వంబంత
ఆనంద జలధిలో నలరింపజేయాలి!

నా పాటలో నీవు నాదమై మెదలాలి
నీ మురళిలో నేను నిస్వనంబవ్వాలి!

నీ యందచందాలు నీ వలపు రాగాలు
నా పాటలో జింది నాట్యాలు జేయాలి!
మధురాక్షరములలో మాధుర్య భావాలు
పాటలో విలసిల్లి పరవశము జేయాలి!

పొన్న చెట్టూమీద పొలుపుగా గూర్చుండి
మురళి బాడుచునుండ మోదమున నే బొంగి!
అచ్చరకువోలె నే నందాలు జిందుతూ
నాట్యాలుజేయాలి నా పాటబాడుతూ!

ప్రకృతినంతా మనము బరవశము జేయాలి
నీ మధుర మురళిలో నే స్వనము నవ్వాలి!
నీ పాటబాడుదూ నిను కంటజూచుచూ
నీ కాంతిపుంజాన నే కలిసిపోవాలి!

నా పాటలో నీవు నాదమై మెదలాలి
నీ పాటలో నేను నిస్వనంబవ్వాలి!

## అలసిపోయితినమ్మ!

అలసిపోయితినమ్మా! సొలసిపోయితినమ్మా!
అందాలకృష్ణుని యటు యిటు వెదికి!
కనిపింప డెందుకే? కనికరించి నన్ను!
కమ్మని శ్రీమురళి గానమే వినిపించు!
అలిసిపోయితినమ్మా! సొలిసిపోయితినమ్మా!
అందాలకృష్ణుని యటు వెదకి యిటు వెదికి?

ఆ మొగలిపొదలలో నరసి జూచితినమ్మ
ఈ మల్లెతీవెలను నీ మావితరులందు
వన వీధులన్నియును వరుసగా వెదికితిని
కనిపింపడోయమ్మా! కమనీయ రూపాన!

పాటతో జతకలిపి పాటపాడునె చెలియ!
మాటతో మాటాడి మమతలను పెంచునే!
కొండ కోనలలోని కోకిలలు పాడినటు
వీణపాడిన యటుల వినిపించు మురళితో!

మాటలో మాటయని మనసు నే నడిగితిని
ముద్దుకృష్ణుని పైని మురిపాలవెందుకని?
చెరగనిది! తరగనిది! చెదరిపోవనిదంచు
మనసు బలికినది తన మమత శాశ్వతమంచు

అలసిపోయితినమ్మా! సొలసి పోయితినమ్మా!
అందాలకృష్ణుని యటు యిటు వెదికి!

## కనులలో నుంటావు

కనులలో నుంటావు కమ్మనీ రూపాన!
చెవులందు వినిపించు చెదరనీ మురళీ!

మనసులోనుంటావు! మమతలను జిందుతూ
మాట వినవేమిసి నా మదిలోని తుదికోర్కె

కనులలో నుంటావు! కమ్మనీ రూపాన!
చెవులందు వినిపించు చెదరనీ మురళీ!

హరివిల్లువలె నీవు అన్ని రూపాలతో
కనిపింతువేగాని కమనీయ నీమూర్తి!
కనుల కనిపించి నీ కమ్మనీ పలుకులను
నను నీలో గలుపుకొని నన్ను దరిజేర్పవూ!

మేఘాల యంచులను మెరిసేటి వెన్నెలల
ఆనందమును గూర్చి యలరింతువేగాని
మబ్బుతెరలను దీసి మధురాతి మధురమగు
అబ్బురంబగు రూపు వగుపింప జేయవుగ!

ఎన్నిజన్మము లిటుల విన్నవింపగవలెనో
చిన్ని నాపాటలను జిందింపగావలెనో!
వేదనల రోదనల విలపింపగావలెనో
పండుటాకుగ ధరణి బడి రాలవలెనో!

కనులలో నుంటావు! కమ్మనీ రూపాన!
చెవులందు వినిపించు చెదరనీ మురళీ

# అందాల భరిణగా

అందాల భరిణగా నవరూప సుందరిగ
సృజియించితివి యేల చోద్యముగ కృష్ణా!

మాట పాటా లేక నంచుముత్యము జేసి
దివ్యప్రేమను నిచ్చి దీపింపజేసితివి!

అందాలభరిణగా నవరూప సుందరిగ
సృజియించితివి యేల చోద్యముగ కృష్ణా!

నోరార నినుబిలువ నోచగా లేనైతి
పాడలేనైతి నీ ప్రణయగీతము నోట!
మనసులో నున్నట్టి మమత నెటు దెలుపుదును?
కొండంత నా వలపు గూర్చి యెటు వివరింతు?

చిత్రముగ ననుజేర్చి చిన్నారి చిగురుపై
విశ్వ సౌందర్యమును వెలయింపజేసితివి!
చంద్రకాంతుల ఛాయ జారిపడుచుండునటు
సంధ్యకాంతులు నాలో తొంగిచూచే రీతి!

మనసులో మనసులో మమత దెలుపుచు నీకు
గొంతులో గొంతులో కొసరి పాడుచునుంటి!
బాధతో నాదుహృది భరితమగుచున్నదీ
దొరలుచుంటిని ధరణి దోసమంతా నీదె!

అందాలభరిణగా నవరూప సుందరిగ
సృజియించితివిని యేల చోద్యముగ కృష్ణా!

## మాటాడబోకుమనీ

మాటాడబోకుమని మరిమరీ తెలిపినా
మాటాడు నా మనసు మాధవా! నీతోని!

పాటపాడకుమంచు పలికినా నీ పాట
పాడుచుండును మనసు పరవశము చెందుతూ!

మాటాడబోకుమని మరిమరీ తెలిపినా
మాటాడు నా మనసు మాధవా! నీతోని!

కనికరింపని నిన్ను కరుణామయుడవంచు
కీర్తించుటెందుకో కీరముల జతగూడి
హంస చేడియలతో నడుగు వేయుచునుండు
వనమయూరములతో నొయ్యారమొలికించు!

కోనలో దూరాన కోకిలలు పాడినా
నీ మురళి పాటయని నింగినేలల వెదుకు!
సెలయేటిజాలులో జిలుగునవ్వడుల వినుచు
నీ కాలిమువ్వలని నిట్టూర్చు గనలేక!

అందాల ప్రకృతిని యంతటా నీవనుచు
చిగురు పువ్వులయందు చిత్రముగ నినువెదుకు!
కరుణింపరావుగద! కరుణారసము పొంగ
ఏనాటి బంధమో! యిది నిజము పరమాత్మ!

మాటాడబోకుమని మరిమరీ తెలిపినా
మాటాడు నా మనసు మాధవా నీతోని!

## నా వీణ తీవెలో

నా వీణతీవెలో నాదాలు నీవేను!
నా గొంతు బలికేటి నవగీత మీవేను!

మనసులో విరిసినా మధురభావాలన్ని
నిను గూర్చియేకదా నినదించు శ్రీకృష్ణ!

నా వీణతీవెలో నాదాలు నీవేను
నా గొంతు బలికేటి నవగీత మీవేను

కనుమూసినాగాని కనుదెరచినగాని
నీ రూపమే నిలుచు నిత్యమై సత్యమై

మురళిబాడిన యటుల ముద్దుగులికిన యటుల
మనసుతో మాటాడి మమతదీర్చిన యటుల

నీవు నేనూ గూడి నింగియాకాశాన
తారలను దిరిగినటు దన్మయము జెందినటు

వెన్నెలా పువ్వులూ జల్లినా వనవీధి
పాటబాడిన యటుల పరవశము జెందినటూ

నా వీణయాగదూ నవనీత! క్షణమైన
మౌనమూనదు గొంతు మాధవా చిత్రమిది!

మనసులో భావాలు మల్లెతీగెలుమల్లె
విరబూసి పరిమళము వికసించు నాదుది

నా వీణ దీవెలో నాదాలు నీవేను!
నా గొంతు బలికేటి నవగీత మీవేను!

# గొంతులో నీ పాట

గొంతులో నీ పాట! కొసరి పై పైకొచ్చి
కొంటెకృష్ణుని బాడ గోర్కె యెందులకే?
మఱచినా నా విభుని మాయలను వివరించి
మధుర ప్రేమను గూర్చి మాటలెందులకే?
గొంతులోనీ పాట కొసరి పై పైకొచ్చి
కొంటెకృష్ణునిబాడ గోర్కె యెందులకే?

మనసార నీతోని మధురభావాలతో
వినిపించితినిగదే విలపించి తపియించి!
నీ పాటలో మాట వినడుగద నా స్వామి!
కన్నీరు మిగిలినది! కథయటులె నిలిచినది!

నింగిచుక్కల జూచి నిలిచితిని కొన్నాళ్ళు
దిశలన్ని జూచితిని దీనతను నీతోని!
మనవి జేసితిగదా! మాధవుకు దెలుపమని
ఆశలన్ని చెదిరి యాకాశమాయెనే!

చల్లగా మెల్లగా జారుచూ నా నోట
ఉల్లాసమును గూర్చ నుత్సాహమెందుకే?
నీలోనె బాడుకో! నీలోనె యాడుకో!
నాకు వినిపింపకే నానాథు గథలన్ని!

గొంతులోనీ పాట! కొసరి పై పైకొచ్చి
కొంటెకృష్ణునిబాడ గోర్కె యెందులకే?

## దీపముగ నిను జూచి

దీపముగ నినుజూచి దిక్కులను మఱచితిని
పాటలో లీనమై పదములను మఱచితిని
నీ మురళిగానాన నిలిచి నా మనసంత
తనను తానే మఱచె తన్మయము నొందుతూ!
దీపముగ నినుజూచి దిక్కులను మఱచితిని
పాటలో లీనమై పదములను మలచితిని!

ఆకాశవీధిలో నడుగు మబ్బులగాంచి
నీవేమొ నను భ్రాంతి నిలుచు నామదియందు
మెరుపుదీవెల కాంతి మిలమిలల గాంచుచును
అందాల నీ మోము నగుపించుననిగాంతు!

తొలి సంధ్యలను దోలుకు దోరంపు కాంతులను
నీ ప్రేమ చివురులని నిలిచిజూతును కృష్ణ!
కొలనులో విరిసినా కూర్మి తామరలనూ
నీ నవ్వు లేయనుచు నినదించు నాదుమది!

వెన్నెల వర్షాన చిన్ని పదములతోని
నాట్యమాడిన యటుల నవనీత యనిపించు!
మల్లెమాలతులతో మాధవీలతలతో
మాటాడినటులుండు మాధవా దయతోని!

గొంతు పాడినపాట కోర్కె దీర్పవుగదా!
కనులు గాంక్షించినా కాంక్ష దయసేయవూ
మనసు వేదనలనూ మాధవా! గమనింపు!
బ్రదుకు దరిజేర్చి నా భ్రమలన్ని తొలగింపు

# నిలిచియున్నది కృష్ణ

నిలిచియున్నది కృష్ణ! నీయందు నా వలపు!
చెరిగిపోదెపుడు నిను జేరునందాకా!

మూగగా నను జేసి మోసబుచ్చినగాని
మనసు దాచునుందు మాధుర్యగీతికను!

నిలిచియున్నది కృష్ణ! నీయందు నా వలపు
చెరిగిపోదెపుడు నిను జేరునందాకా!

రాత్రి భగవతి నిన్ను రమ్యముగ దర్శింప
నిలిచి నిరాశయై నీరధిని మునిగినది!
చందురుడు తెల్లనై చల్లగా జారుకొనె
నింగి తారలుగూడ క్రుంగె పడమటివీధి!

మనసు విడిపోదు నిను మాధవా! ఒకక్షణము
కనురెప్ప వాల్పకను గనుచుందు నీదారి!
మాటాగిపోదు నా పాటాగి పోదెపుడు
నాకాంతి నీయందు నాట్యమాడేదాక!

సరిత యలలకువోలె చరియించు నా మనసు
గాలి పిల్లలకువలె గదలాడు నా వలపు!
ముగ్ధ మోహనమైన మురిపాల మురళితో
పాడుచుందును విడక భద్రముగ మానముగ!

నిలిచియున్నది కృష్ణ! నీయందు నా వలపు
చెరిగిపోదెపుడు నిను జేరునందాకా!

## ఏ లోకమున లేని

ఏ లోకమున లేని అందాలు గల స్వామి!
వలచితిని గద నిన్ను వన్నియలు జిందా!
అందుకే మారితిని అందాల గోపికగ
ఆట పాటలతోని యచ్చరల భామగా!

ఏ లోకమున లేని అందాలు గల స్వామి!
వలచితిని గద నిన్ను వన్నియల జిందా!

మాటాడ నేర్చితిని మధురముగ చిలుకలా
పాడగా నేర్చితిని పడతి కోకిల వోలె!
హంస గమనములాగు నల నడక నేర్చితిని
వన మయూరము వోలె నొయ్యార మొలుకగా!

నీ మురళి నినదించు నిఖిల సౌందర్యములు
అఖిల జీవుల ముంపు నానంద సౌఖ్యముల!
నా గీతి సంపదయు నవ్యతలు దెలియుగద
మధురాక్షర ధ్వనుల మాధుర్యములు గదా!

నా ప్రేమ నీ ప్రేమ నవచిత్ర శాలయై
జతగలిసె నిరువురికి జరియింప ప్రేమతో!
నిను జూడకుండ నే నిమున ముండగజాల
నను జూడకుండగా నవనీత నిలువవు!

ఏ లోకమున లేని యందాలు గల స్వామి!
వలచితిని గద నేను వన్నియలు జిందగా!

## శ్రావణ మేఘాలు

శ్రావణా మేఘాలు చరియించె గగనాన
పూలజల్లులతోని పొలువు సిగ్గులతో!
ఉఱుములను మెఱుపులను ఒడిలోన నింపుకొని
అందాల హరివిల్లు నందలంబును నెక్కి!
శ్రావణా మేఘాలు చరియించె గగనాన
పూలజల్లులతోని పొలువు సిగ్గులతో!

వనమయూరములు వని వన్నెచిన్నెలు జింద
రమణీయముగ దివ్య రమ్యాన రన నేయ!
హంసచేడియలు తమ హాస్య లాస్యములతో
స్వాగతం బిడుచుండె సరసమేఘముల కదె!

చల్లగాలులు వీచె సరస గంధములతో
మేఘ పుష్పములతో మేదినీ వికసించె!
ఆకుపచ్చని చీర యలరి ప్రకృతిదాల్చె
భూమాత ధరియించె పొలువు శ్రీగంధమును!

ఈ సుందరంబయిన యీ వర్ష ఋతువులో
రాకూడదా ప్రభూ! రమణీయ మురళితో!
దాసి విరహముతీర్చి దయజూపకూడదా?
జ్యోతిలో జ్యోతిగా ప్రీతిగూర్పగ రాద?

శ్రావణా మేఘాలు జరియించె గగనాన
పూలజల్లులతోని పొలువు సిగ్గులతో!

## వచ్చునట మాధవుడు

వచ్చునట మాధవుడు! వయ్యారములు జింద
కనిపించునట చెలీ! కరుణ వికసింపా!

ఇంతకాలపు కోర్కె కాంతరో! ఫలియించి
నానోము ఫలమిటుల నవరాత్రులాయెనే!

వచ్చునట మాధవుడు వయ్యారములు జింద
కనిపించునట చెలీ! కరుణ వికసింపా!

శారదాభ్రమువోలె చరియించె నా మనసు
వెన్నెలా లేఖలను వేడుకల నొలికెనే!
కలువ తామరలతో కొలకులటు నిండినటు
నా మదిని నిండెనే నవ లలితగీతములు!

పన్నీటి జలకముల పట్టుచీరెలతోని
తీర్చిదిద్దుడు నన్ను తీరయిన బొమ్మలా!
విడిన కురులను ముడిచి విమల శ్రీగంధమును
నుదుటనిడుడో చెలులు! చెదరిపోవగ తమసు!

కలగాదు; గథకాదు; కాంతరో నిజమిదీ
పంపినా రాజిలుక పయనమయి వచ్చినది!
నా హృదయవల్లభుడు నా లేఖనందుకొని
వచ్చుచున్నాడటే వయ్యారములు జింద!

వచ్చునట మాధవుడు! వయ్యారములు జింద!
కనిపించునట చెలీ! కరుణ వికసింపా!

# ఈ చిన్నివయసులో

ఈ చిన్నివయసులో ఏనాడు నేర్చితివి
మోహానంబయిన యీా మురళిపాటను బాల!

సకలజీవులు నీదు సంగీతధ్వనులు విన
విలపించుచున్నవీ విరహ గీతికలతో!

ఈ చిన్నివయసులో ఏనాడు నేర్చితివి!
మోహానంబయిన యీా మురళిపాటను బాల!

నీ మురళిరవముతో నే జతగ నాగీతి
నాలపించాలనే యాశతో గోపాల!
పూదోట పొదలలో పున్నమీా వెన్నెలల
వెదుకుచుంటిని స్వామి వేదనలు బొంగార!

ఆకాశమంతటా యులుముకున్నా నీదు
మధుర మురళీధ్వనుల మాధుర్యములతోని!
శ్రుతిలయల కలయికను సుందరంబులతోని
జతగూడదెందుకో సరిగమల నాగీతి!

బ్రతికినన్నాళ్ళు నే బాధలె న్నెదురయిన
నీ మురళివిందు నే నిరతమును శ్రీకృష్ణ!
విరహవేదనను నే విలపింతు గృశియింతు
లలితగీతముల నిను లాలింతు! ప్రేమింతు!

ఈ చిన్నవయసులో ఏనాడు నేర్చితివి
మోహానంబయిన యీా మురళిపాటను బాల!

## కొండ కోనలలోన

కొండకోనలయందు కోకిలా పాడినటు
నాపాట వినిపించు నలుగురూ వినగా!

అణువణువు ధ్వనియించు అందాల మురళిగా
నీపాట వినిపించు నిఖిల లోకములన్ని!

కొండకోనలయందు కోకిలా పాడినటు
నాపాట వినిపించు నలుగురూ వినగా!

నాపాట వినిపించు నయముగా గుహాలలో
చిత్రమా శిల్పాలు శిలలన్ని ధరియించు!
గుహాలన్ని వెలయు నీకూర్మి మురళీధ్వనుల
ఆరాధనాలయము లగును శ్రీ కళలతో!

చినిచిన్ని యలలతో చిన్నారి సెలయేఱు
నాపాట పాడుకుని నాట్యాలు సేయునా!
ఆటుపోటులలోని యంబుధిని జెల రేగు
నీ మధుర నాదాలు నిండయిన ధ్వనులతో!

నీపాట సరిగాను; నీమాట జతగాను!
నీలోని యణువునూ నీపాట నాదమును!
కలుపుకొని నీ మురళి! కళ్యాణి రాగమున
నిలుపుకొను మాధవా! నీడగా జాడగా!

కొండకోనలయందు కోకిలా పాడినటు
నాపాట వినిపించు నలుగురూ వినగా!

## లేఖలెన్నంపినను

లేఖలెన్నంపినను లీలగా జూచెదవు!
బరికింపబోవుగా బరగ నా వినతీ!

పగిలిపోవుచునుండె భాధతో నా గుండె!
తిరిగి చూడవుగదా! తీరుగా శ్రీకృష్ణ!

లేఖలెన్నంపినను లీలగా జూచెదవు
పరికింపబోవుగా బరగ నా వినతీ!

చిలుక గోరింకలను దీరుగా జతజేసి
ప్రేమలేఖలతోని ప్రీతి కబురంపితినీ!
మేఘమాలలతోని మెఱువు దీవెలతోని
లేఖలంపితి సఖా! లేదుగా దయనీకు!

కనురెప్పలార్పకను గాంచుచుంటిని స్వామి!
రాత్రిబవళులు నీదు రమ్య దర్శనముకయి!
కిన్నరను జేబట్టి కీర్తనల బాడగా
బరువాయె నా గుండె బాధలను వేదనల!

కన్నీటి పువ్వులను కమనీయ గీతముల
పూజించుచుంటిని! పులకరింపగ తనువు!
తొంగిచూడగ రాద! తోరంపు దయతోని
ఒకసారి! ఒకసారి! యోరగా శ్రీకృష్ణ!

లేఖలెన్నంపినను లీలగా జూచెదవు!
పరికింపబోవుగా బరగ నా వినతీ!

# రసభావ భరితమై

రసభావభరితమై రాజిల్లు నా గీతి
లలిత పదములతోని లాలిత్యముగనూ!
తీయనీ నీ మురళి తేనెలకు సాటిగా
ఆనంద సుధలలో నలరించుగద స్వామి!

రసభావభరితమై రాజిల్లు నా గీతి!
లలిత పదములతోని లాలిత్యముగనూ!

నా మనసులో నుండి నవనీత! నీ మురళి
పలికినా పలుకులే పాటగా రూపొందె!
అలగోపికను గదా! అందుకే నాకబ్బె
మధుర భావాలు మరి మాధుర్య గీతికలు!

జన్మ జన్మల స్నేహ సంబంధమే గదా!
నరసముగ నీభక్తి! సహయోగమే గదా!
పాటగా రూపొంది పల్లవించెను స్వామి!
వినతిగా దీపించె వేయి గీతాలతో!

విడిపోని బంధమిది! పడిపోని కోవెలిది!
కలిసియున్నా నన్ను కడకెటుల ద్రోచెదవు?
నీ మురళి పాటతో నిఖిలేశ! నా గీతి!
కోటి జన్మలదాక కొనలేక పయనించు!

రసభావభరితమై రాజిల్లు నా గీతి!
లలిత పదములతోని లాలిత్యముగనూ!

# కన్నీరు వరదలయి

కన్నీరు వరదలయి కడలిలో గలిసినది!
కనికరము నీయందు గానరాదింతా!

విరహ జ్వాలను రగిలి పొగలెగయుచున్ననూ
చల్లనీ యెద జేర్ప సఖియు! రా! రమ్మనవు!

కన్నీరు వరదలయి కడలిలో గలిసినది!
కనికరము నీయందు గానరాదింతా!

మెత్తనీ మనసునూ కత్తెరలతో బొడిచి
కదలనీయక నన్ను గాయమును జేసెదవు!
ఎవరితో మొరలిడుచు విన్నపము జేయుదును
అణచివేయుదు నెటుల యారనీ విరహాగ్ని!

ఏమూల జూచినను నే దిశను గనుగొన్న
నీ రూపు గనిపించు! నీ మురళి వినిపించు!
చేర రావెందుకని? చెలియ కలతను బాప?
యెద జేర్చుకొని నాదు వేదనను దీర్పవూ?

మురళి నామము కృష్ణ! ముద్దులొలికే మోము
కనుజాటు జేయుమూ! కారుణ్యమును జూపి!
మధుర గీతముతోని మతి నీదు మురళినీ
జత జేసి బాడకుము! చైతన్య రాగముల!

కన్నీరు వరదలయి కడలిలో గలిసినది!
కనికరము నీయందు గానరాదింతా!

# విభుడంపినా లేఖ

విభుడంపినా లేఖ వివరింపుదును చెలీ!
మాధవుని మనసులో మధుర భావాలూ!

తనుగూడ నావలెనె తపియించు చుండెనట!
తగ విరహమును జెంది దాసి నగు నన్బ్రోవ!

విభుడంపినా లేఖ వివరిపుదును చెలీ!
మాధవుని మనసులో మధుర భావాలూ!

మఱువలేదో యెటుల మాధవుని నే మదిని
మఱువలేదట తాను మధుర స్మృతులన్నిటిని!
కర్మబంధములన్ని కడద్రోచి బ్రోచునట!
తనలోన జేర్చుకొని తన్మయము జెందునట!

చిరకాల బంధమును జెదిరిపోనీయడట
మనసులో నిలుచునట మధురగీతముతోని!
అడుగడుగు నాపదల యరనీ దాటించునట!
మాటిమాటికి మురళి మధురముగ బాడుచును!

ఒక కంట మోదమును ఒక కంట రోదనము!
ప్రవహించుచున్న వే పన్నీరు! కన్నీరు!
విమల ప్రేమను దెలిపి విభుడంపినా లేఖ
ఎదలోన దాచుకుని మది పొంగిపోదునే!

విభుడంపినా లేఖ వివరించి తెలుపుదును!
మాధవుని మనసులో మధుర భావాలేవో!

# నిన్ను మనసున దలప

నిన్ను మనసున దలప నిఖిలేశ! శ్రీకృష్ణ!
నవసంధ్య కుంకుమలు నా మనసు దోలుకూ!

వాసంతఋతువులో వన్నెలా పూవులటు
మధురపదములు పూచి మాధుర్యగీతమగు!

నిన్ను మనసున దలప నిఖిలేశ శ్రీకృష్ణ!
నవసంధ్య కుంకుమలు నా మనసు దోలుకూ!

పక్షిలా గగనాన బరువులెత్తును మనసు
చుక్కలను నందుకొన సూటిగా విహరించు!
ఆడుచూ పాడుచూ ఆకాశమధ్యాన
మధురగీతము పాడ మనసూగుచుండునూ!

తుమ్మెదగ నేమూరి తూలుతూ వనవీధి
పూవుపూవున వ్రాలి పులకింతు నినుదలచి!
తరులతల జూచి నే దన్మయము నొందుదును
మనసులో నీ రూప మాధుర్య మదియేమొ!

నీకు నాకును మధ్య నిలిచినా బంధమిది
చిగురుపూవునకు గల చిరకాల స్నేహమిది!
కలకాల మిటులనే కదలనీ కాలమును!
ఎడ తెగని బంధమును విడివడని స్నేహమును!

నిన్ను మనసున దలప నిఖిలేశ శ్రీకృష్ణ!
నవసంధ్య కుంకుమలు నా మనసు దోలుకూ!

# ఆషాఢమేఘాలు

ఆషాఢమేఘాలు! అవిగవిగో అరుదెంచె!
అతి మనోహరముగా నందాలు జిందా!

వర్ష ధారలతోని వయ్యారమొలుకుతూ
పుడమితల్లిని దడిపి పులకలను గూర్పగా!

ఆషాఢమేఘాలు! అవిగవిగో యరుదెంచె!
అతి మనోహరముగా నందాలుజిందా!

క్రొత్త జివురులతోని క్రొత్తపూవులతోని
కొమరొప్ప ప్రకృతిని కోరికలు విరియింప
అచ్చరల యందాలు నణువణువు జిత్రింప
చిత్రకారునివోలె జేరవచ్చిన వవిగో!

ఆకుపచ్చని చేల యానందమును గూర్ప
పూలతల తరువులను బులకింప దులకింప!
అందాల హరివిల్లు నాకాశమున నిల్పి
సకలజీవుల హర్ష స్వాగతంబును గొనగ!

వర్షర్తు వచ్చినది! వరుసదప్పకుమయ్య!
వత్తునని బలికితివి వగలాడ శ్రీకృష్ణ!
నా విరహమును బాపి నన్ను యెద జేర్చుకొని
ఆవుమా తాపమును నమృత కిరణాలతో!

ఆషాడమేఘాలు అవిగవిగో యరుదెంచె
అతిమనోహరముగా నందాలుజిందా!

## బంగారు వీణియను

బంగారువీణియను బడతి! తేవే వేగ!
పాడెదను విభునిపయి ప్రణయగీతమునూ!

మధురభావాలేవో మదిలోన వికసించె
అలరించుచున్నవే ఆత్మనాథుని గూర్చి!

బంగారువీణియను బడతి తేవే వేగ!
పాడెదను విభునిపయి ప్రణయగీతమునూ!

వాసంతమున విరియు
వన్నెలా పువ్వులటు!
మాధుర్యములు చింద మనసునను బూచెనే!

అలలవలె తెరలవలె
అంబుధిని దరగలటు
మది దాకుచున్నవే మాధవుని భావనలు!

హిమబిందువుల వోలె
కమనీయ గీతాలు
మధురాక్షరములతో మనసునను దోచెనే!

మదిలోన మొలిచినా
మాధుర్యగీతాలు
వీణపై వినిపింతు విమలరాగాలతో!

బంగారు వీణియను బడతి! తేవే వేగ!
పాడెదను విభునిపయి ప్రణయగీతమునూ!

## అరుణ కాంతులయందు

అరుణ కాంతులయందు అందాల సంజలను
నీ మురళిగానమే నేవిందు గోపాలా!

నీలాంబరమునందు నిలిచినా తారలను
చంద్రకాంతులయందు జలధారలందునూ!

అరుణ కాంతులయందు అందాల సంజలను
నీ మురళి గానమే నే విందు గోపాల!

విశ్వమోహనమైన విమలమగు నీ రూపు
అణువణువునను నిలిచి యాశ్చర్యమును గొలుపు!
పాటలో మాటలో పల్లవిని నిలుచుచును
ఏ చోటు జూచినా యాచోటు నుండెదవు!

మంచి మాటను నిలిచి మరియాదలో నిలిచి
మమతలో ప్రేమలో మధుకమల నొలికెదవు!
శ్రమయందు కృషియందు సారథిగ ముందుండి
కనిపించుచుందువూ కర్మ పథమార్గమున!

సృజియించి పోషించి సుందరంబుల గూర్చి
మజిల జిత్రించెదవు మాధుర్య మొలుగగా!
ఇంతజేసిన గూడ సుంతశ్రమ నొందవూ!
మురళిగానమె కదా మోదమగు పరికరము!

అరుణ కాంతుల యందు అందాల సంజలను
నీ మురళిగానమే నే విందు గోపాల!

## మురళి వినిపింపగా!

మురళి వినిపింపగా! మోదమున గొంతెత్తి
మధుర గీతము పాడ మనసు పులకించే!

చీకటులు నశియించి చిఱుకాంతి దీపాలు
కనుల ముందున నిలిచె కమనీయ రూపాన!

మురళి వినిపింపగా మోదమున గొంతెత్తి
మధుర గీతములు పాడ మానసము పులకించే

నీ మురళి పాటతో నిఖిల ప్రకృతి యోగి
కనుదెఱచి చూచినది కాంతిరేఖలు దొలుక!
కొండలో కోనలో క్రొత్త యందములతో
నవరాగ సుందరము నాట్యాలు చేస్తోంది!

ఆఱు ఋతువులలోని యందాలు విరిసినవి!
భూమి యాకాశాలు పొలువులను జిందినవి!
పూచినా పూలతో బూదీగ లూగినవి!
తరులూగె తలిరాకు తరగనీ యందాల!

ఎటునుంటివో ప్రభూ! ఇటుజూడు మొకసారి
వరమాల గ్రహియించి వాంఛ దీర్పగ రమ్మా!
వాసంత శుభవేళ వరుడవై రారమ్మా!
దాసి కోరిక దీర్చి దయగనుము శ్రీకృష్ణ!

మురళి వివిపింపగా మోదమును గొంతెత్తి
మధుర గీతము పాడ మనసు పులకించే!

# ఈ కొండ దాపునే!

ఈ కొండ దాపునే! ఈ యేటి దరులనే!
మనమాడి పాడినది! మానసము పులకింప!

చిలుక గోరింక లవి చిత్రముగ మన కథలు
దెలుపుచున్నవి కనుము సింగారములు జిందా!

ఈ కొండ దాపునే! ఈ యేటి దరులనే!
మనమాడి పాడినది! మానసము పులకింప!

అందాల మురళి నీ వాలపించినదిచట!
మధురగీతిని నేను మైమఱచుటిచటనే!
వన్య మృగములవన్ని వయ్యార మొలికించి
నిలిచి చూచిన దిచట నీటుగా జెలికాడ!

కొండ గోగుల పూల కూర్మితో వరమాల
కూర్చిపేర్చిన దిచట కోరికను ప్రియసఖా!
మాలవేయగ నీవు మదిపొంగి మురళినీ
శీర్షమున జేర్చినా సింగార మిచటనే!

ఆనాటి యందాలు అలనాటి ముచ్చటులు
కదలాడుచున్నవీ కాంతి రేకలవోలె!
రారమ్ము! శ్రీకృష్ణ! రమ్యముగ నా దరికి
కథలన్ని దెలిపెదను కావ్యగానము రీతి!

ఈ కొండ దాపునే ఈ యేటి దరులనే
మనమాడి పాడినది! మానసము పులకింప!

## చెలి మనసు దెలియదా?

చెలి మనసు దెలియదా? తేటతెల్లముగాద!
వివరింప వలయునా? వివరముగ కృష్ణా!

మనసులోనున్న నీ మధుర భావాలేవో
విరహ గీతములోని వేదనలు దెలియుగద!

చెలి మనసు దెలియదా? తేటతెల్లము గాద!
వివరింపవలయునా? వివరముగ కృష్ణా!

సెలయేటి జాలుగా జారుచును కన్నీరు
నీ నామమును బలుకు నిలిచి సుడులను దిరిగి!
చిఱుజేప పిల్లలును జేరి కనులార్పకను
నీ నామమును బలుకు నీటుగా నీదుచును!

పొగ మంచుగా మారి పొగిలి నా వేదనలు
అంచబామల దాకు నాకాశమును దాకు!
తరగలయి నురుగులయి తపియించి వేదనను
పాటగా వినిపించు పడతి పాడిన యటుల!

కన్నీటి కొలనులో గనుగొనుము నీ రూపు
నీవు లేకుండగా నీ ఛాయ కనిపించు!
కదిలి బయటకు రమ్ము! కరుణతో నన్ బ్రోవ
కన్నీరు దుడిచి నను గడలి దాటింపుమా?

చెలి మనసు దెలియదా? తేటతెల్లముగాద!
వివరింపవలయునా? వివరముగ కృష్ణా!

# కనులతో నీ మధురమూర్తిని

కనులతో నీ మధుర మూర్తిని
గాంచనీవా! ఒక్కసారి!
మధుర మురళీ నిస్వనములను
మనసునను మ్రోయించుచుందువు!
కనులతో నీ మధుర మూర్తిని
గాంచనీవా! ఒక్కసారి!
ఎక్కడో ఏ మూల నుండో!
చక్కనయినా మురళిరవముల
మక్కువను వినిపింతు వెందుకు
చిక్కనీ నా మనసు జిందుచు!
మనసు పొరలను దాగియుండీ
మమతతో నను జూచుచుందువు!
కరముబట్టీ యెదను జేర్చి
కరుణజూపవు నెదుట నిలిచీ!
రాగ బంధము ఎన్ని నాళ్ళో?
రవలుజేయుట ఎన్ని జన్మలు?
జ్యోతిలో నే గలిసిపోయీ
దీప్తి జెందుట యెన్నడోయీ?
ఎన్ని జన్మలు కాని పోనీ!
నిన్ను మఱువను జిన్ని కృష్ణా!
కిన్నెరను జేపట్టి యిటులే
విన్నపములను బాడుచుందును!

## మనసిచ్చి మాటాడి

మనసిచ్చి మాటాడి మన్ననను సేయవూ
దురపిల్ల జేయుదువు దూరమున నిలిచీ!
నీడగా గనబడుచు లేడిగా బరువెత్తి
మనసు కలతనుజేసి మాయజేసెదవూ!
మనసిచ్చి మాటాడి మన్ననను సేయవూ
దురపిల్ల జేయుదువు దూరమున నిలిచీ!

ఒకమాటు నినుజూడ ఒకమాటునను జూడ
కనులు కనులూ కలిసి కలిసి నాల్గవ్వగా!
ఎన్ని జన్మల కోర్కె! ఎన్ని యుగముల కాంక్ష!
తీరు నెన్నాళ్ళ కిది? తీవె పూవులు పూచి!

మాటమాటా కలిసి మధురిమలు విరియగా
పాట పాటా కలిసి పరవశము జెందగా!
నింగి నీ కాంతిలో నివసింప కిరణమై
కోరుచుంటిని స్వామి కోటి జన్మలనుండి।

దాసినని మదితలచి దయ దలపకుంటివో
ఆటకత్తియ ననుచు నలరింపకుంటివో!
కిన్నెరను జేపట్టి కీర్తనల బాడగా
మఱియెవరు లేరనుచు మది దలపకుంటివో!

మనసిచ్చి మాటాడి మన్ననను సేయవూ
దురపిల్ల జేయుదువు దూరమున నిలిచీ!

## వన్నెలాడిని కృష్ణా

వన్నెలా కృష్ణునీ వలచి నే నిటులయితి
సఖియలారా వినుడు చాటుమాటులు లేవు!

కనుచూపుకందడూ కలిసి మాటాడడూ
విరహమును మాన్పి నావేదనను మాన్పడూ!

వన్నెలా కృష్ణునీ వలచి నే నిటులయితి
సఖియలారా వినుడు చాటుమాటులు లేవు!

నెమిలిపింఛము జూచి నెమ్మొగవు సొగసులను
ఆడి గజ్జియలతోని చిందేటి నాట్యాలు!
మురళిపాటను వినుచు మోదమున మాయగా
అతని పాలయితి నే సరకొరలు లేకుండ!

మనసిచ్చి నిజముగా మాధవుని సతినైతి
అతని దరి చేరగా నాలపించుచుంటి!
విరహమున దపియించి వీధులను దిరుగుచును
వెదుకుచుంటిని హరిని విమలకిన్నెర దాల్చి!

సొగసులన్నీ మాసి సోలితిని విరహమున
మంచు తెరలోనున్న మగువ కలువనునైతి!
ఆషాఢ మేఘాల యల్లికను జిక్కినా
చంద్రకాంతికి పోలె దేలుచుంటిని జగతి!

వన్నెలాకృష్ణునీ వలచి నే నిటులయితి
సఖియలారా వినుడు చాటుమాటులు లేవు!

# ఆ గుడిని యుందువని

ఆ గుడిని యుందువని యీ గుడిని యుందువని
అంతటా వెదికితిని యలరుచును కృష్ణా!

ఆ నదిని యీ నదిని యన్నిటా నే మునిగి
నిన్ను దలచితిగాని నీ నన్న కనబడదు!

ఆ గుడిని యుందువని యీ గుడిని యుందువని
అంతటా వెదకితిని యలరుచును కృష్ణా!

శిలలు శిల్పాలనూ చిత్రలేఖనములను
మానవుడు నిర్మించు మహిమాన్వితములనూ!
అన్ని జూచితిగాని అందాల గోపాల!
కమ్మనీ మాటాడి కనులజూడవు దయను!

ఎక్కడున్నావనుచు మక్కువగ ప్రశ్నించ
గుడిమెట్లు జెప్పినవి గుర్తుగా అల్లదుగో!
ఆకలీ దప్పికల నల్లాడు మానవుల
నేదదీర్చెడివాడు శ్రీహరియె గనుమనుచు!

కలత నలతల నలిగి కన్నీరు నొలికేటి
పేదసాదల నడుమ ప్రీతి దిరుగుచుననుచు!
ఆ రులను గాపాడ నలత జెందుదువనుచు
గుడిగంట జెప్పినది గుర్తుగా వినుమనుచు!

ఆ గుడిని యుందువని యీగుడిని యుందువని
అంతటా వెదికితిని యలరుచును కృష్ణా!

# ఆషాఢ మేఘాలు

ఆషాఢమేఘాలు అవిగవిగో వచ్చినవి
గగనమంతా పూచె కాటుకల పూలూ!

నా హృదయ గీతికయు నవ్య రాగాలతో
వాన కోకిలలవోలె వన్నెలను జిందినది!

ఆషాఢమేఘాలు అవిగవిగో వచ్చినవి
గగనమంతా పూచె కాటుకల పూలూ!

మేఘ పుష్పాలతో మేదినీ తడిసినది
చల్లనీ గాలులను చలియించె జగమంత!
ఉఱుములను మెఱుపులను నుర్యూతలూగుచును
పచ్చచీరెను గట్టె ప్రకృతి యందాలతో!

వాన చినుకులయందు వన్నెలా హరివిల్లు
హరివిల్లులో కృష్ణ! అందాలు నీవేను!
నీ మురళినాదాలు నిండినవి నా మదిని
నాగీతి మొలకెత్తె నవపల్లవములతో!

చిన్నారి శ్రీకృష్ణ! చిరుగజ్జియల మ్రోత
నా యింటిముందరను నాట్యాలు జేయుమా!
జన్మజన్మలకోర్కె జాలుగా ప్రవహింప
పిల్లనాగ్రోవినీ అల్లనా మ్రోయింపు!

ఆషాఢమేఘాలు అవిగవిగో వచ్చినవి
గగనమంతా పూచె కాటుకల పూలూ!

## నా హృదయ దీపమా?

నా హృదయ దీపమా! నా కనుల తెలిరేఖ!
ఆరిపోబోకుమా! అంతరంగమునా!

వేగు చుక్కకు మల్లె వేయికాంతులు విరిసి
దారిజూపుచునుండు తయదలచి యాత్రలో!

నా హృదయ దీపమా! నా కనుల తెలిరేఖ!
ఆరిపోబోకుమా! అంతరంగమునా!

విజ్ఞాన దీపమా! విభుడు నిను దయజేసె!
కలిసి పయనింపుమా! కడవఱకు నాతోని!
పెనుగాలి తాకులకు భీకరంబగు సుడుల
మాయమైపోబోకు! మదిని చీకటి జేసి!

దారిజూపనుగదా! దయజేసె విభుడు నిను
చివరి మజిలీ వఱకు చిరశాంతి మదినుండు!
మదియందు పతనమయి మానసము చిదుపకుము!
నా హృదయ గీతిలో నాట్యాలు సలుపుమా!

కటిక చీకటిలోన కారుచీకటి తెరల
మబ్బులో మసకలో మైదానములయందు!
నేబోవు దారిలో నీడలందున నిలిచి
వెలుగు కిరణాలతో వివరింపు గమ్యమును!

నా హృదయ దీపమా! నా కనుల తెలిరేఖ!
ఆరిపోబోకుమా! అంతరంగమునా!

## ఆషాఢ మేఘాలు

ఆషాఢ మేఘాల యలరు జలధారలుగ
కన్నీటి ధారలవి కదులుచున్నవిగా!

విరహ మూర్ఛలతోని వేగుచుంటిని చూడు!
తెలివితో నపుడపుడు దేలుచుంటిని స్వామి!

ఆషాఢ మేఘాల యలరు జలధారలుగ
కన్నీటి ధారలవి కదులుచున్నవిగా!

కన్మనీ దయతోని కదలివచ్చిన గూడ
నిను జూడ జాల నే నీ రూపు రేఖలను!
కన్నీరు జారినా కనులతో మాత్రమే
నిను జూడ గలుగుదును! నిఖిలేశ! ఒకక్షణము!

క్షణక్షణము మూర్ఛలను దపియించు తనువుతో
నిను బాడగా లేను నిండారు హృదయాన!
అపుడపుడు బాడెదను అందాలు జెదరగా
శ్రుతిలేని గొంతుతో! లయలేని రాగాన!

శ్రీచందనములతో శీతలోదకములతో
నను నేద దీర్చేటి నా యాత్మ బంధువుల!
చిలుక గోరింకలను చిన్నారి పిచ్చుకల
తరులతల నడుగుమో! తరలివచ్చిన స్వామి!

ఆషాఢ మేఘాల యలరు జలధారలుగ
కన్నీటి ధారలవి కదులుచున్నవిగా!

# కదిలిపోలేవులే!

కదిలిపోలేవులే! కనుజూపులను దొలగి!
మరిగిపోలేవులే! మనసు పులకించీ!

బంధించితిని కృష్ణ! భావబంధురమైన
మధుర గీతికలోని మానసమునందునా!

కరిగిపోలేవులే! కనుజూపులను దొలగి
మరిగిపోలేవులే! మనసు పులకించీ!

మురళి పాటను బాడి మోదమును గలిగించి
మనసు దోచితివి! నను మాయలో ముంచితివి!
దాగుడూ మూతలను దపియింప జేయుచును!
నను ద్రిప్పుచుంటివీ! నాట్యక త్రైకవోలె!

అందుకే నేర్చితిని! యలనాటి యా పాట!
తీయనీ రాగాల తేనె లొలికే గీతి!
కరచరణముల నిన్ను గదలనీయని పాట!
గోప వనితగ నాడు కూడి పాడినపాట!

ఆషాఢమేఘాలు అందాల జాబిలిని
కప్పిగ వేసిన రీతి గప్పితిని! నిను కృష్ణ!
అలలుగా, తెరలుగా సుడులుగా దిరుగుచూ!
నా మనసునుందువిక! నయముగా నెటుబోక!

కదిలిపోలేవులే! కనుజూపులను దొలగి!
మరిగిపోలేవులే! మనసు పులకించీ!

# ఏనాటి విరహమిది?

ఏనాటి విరహమిది? ఏనాటి బంధమిది?
విడువదెపుడును కృష్ణ! వేధింపు నన్నూ!
నీ మురళి నాదాలు నిశిదినము ధ్వనియించు
నా గొంతులో పాట నడయాడు ప్రతిక్షణము!

ఏనాటి విరహమిది! ఏనాటి బంధమిది!
విడువదెపుడును కృష్ణ! వేధింపుచును నుండు

ఎలమావి తోటలో విహరించు కోకిలలు
వాసంత ఋతువులో వలపు లొలుకుచునుండు!
నా విరహ గీతమది నలిగిపోదెన్నడును
ఆఱు ఋతువులయందు నలరుచుండును కృష్ణ!

నీ మురళి నాదాలు నినదించు నిరతమును
గిరిపోనవలె బలుకు గిరులెన్ని గీచినా!
అవ్యక్త నాదముగ ఆనంద వాహినిని
ననుముంచు ననుదేల్పు! నవరాగ సుఖలలో!

నను విడిచి నీ మురళి నిను విడిచి నా గీతి
నిలిచియుండగలేవు! నిజముగా శ్రీకృష్ణ!
కలకాల మిటులనే కలిసి సాగగనిమ్ము!
నీ పాట నా పాట నింగి పక్షులవోలె!

ఏనాటి విరహమిది! ఏనాటి బంధమిది!
విడువదెపుడును! కృష్ణ వేధింపు నన్నూ!

# నా హృదయ పూలతను

నా హృదయ పూలతను నవగంధ భరితమును
నలిగిపోనీకుమా నవ మోహనాంగా!

నా మధురగీతమును నవ్యానురాగముల
అందాలకూచినీ యణచివేయకు కృష్ణ!

నా హృదయ పూలతను నవగంధ భరితమును
నలిగిపోనీకుమా నవమోహనాంగా!

నినుపొంద నాకోర్కె నిన్నటిది కాదుగద!
జన్మజన్మలనాడు జాలువారినదీ!
చిన్ని మొక్కను నాడు చిత్రముగ పెంచితిని
పుష్పించినది చూడు పున్నమీ జాబిలిగ!

నా చిన్ని కిన్నెరను నవగీతముల నెన్నొ
నా మనసు పాడినది నందగోపాలా!
వలపులెన్నో జిందె వయ్యారమొలికించి
నా కాలిగజ్జియలు నాదములు ధ్వనియింప!

నినుజేర నేరకను నీ విరహజ్వాలలో
తపియించుచుంటినీ తపసివలె మౌనముగ!
నా విరహజ్వాలలను నవనీత యార్పుమా
మలయ వీచికలతో మది జేర్చు ప్రేమతో!

నా హృదయ పూలతను నవగంధ భరితమును
నలిగిపోనీకుమా నవమోహనాంగా!

# ఎటునుంటివో స్వామి

ఎటునుంటివో స్వామి ఇటుజూడు మొకసారి
పిలిచినా పిలువులకు ప్రేమజూపుచునూ!
నా ప్రేమగీతమును నా భక్తి రాగమును
ప్రీతితో వినిపింతు ప్రియముగా కృష్ణా/

ఎడబాటు గలిగినది విడిపోతి మానాడు
మరల మన కలయికకు మార్గమును వెదుకుచూ
విరహగీతముతోని వీధులను వాడలను
వెదుకుచుంటిని స్వామి మదిజ్వాల రగులగా!

కిన్నెరను చేబట్టి కీర్తనలు పాడుచును
సంధ్య వెలుగులయందు సాహిత్యదీపికల!
గగన తారకలలో కన్నీటి ధారలను
నిను వెదుకుచుంటినోయ్! నిండారు మనసుతో!

కనిపింపు మొకసారి కడసారి గీతమిది
వినిపింపు మొకసారి వేణువును మ్రోయించి!
విరహతాపముతోని వేదనను కుమిలేటి
దాసినని దయతలచి తలపు పూరింపుమా!

ఎటునుంటివో స్వామి ఇటుజూడు మొకసారి!
పిలిచినా పిలువులకు ప్రేమ జూపుచునూ!

## మనసుదలచిన యపుడు

మనసు దలచినయపుడు మాధుర్య మొలికించి
కనులముందర నిలిచి కలత బాపెదవూ!

అంతలో మాయమయి అంధకారము లోని
విరహావేదనల్లోని వ్యథ గలుగజేసెదవు!

నే గీతి బాడగా నిఖిలాత్మ నీవునూ
పిల్లన్రగోవినీ ప్రీతితో బాడెదవు!
నాపాట నాపగా నవనీత! నీపాట
మబ్బున్రగమ్మినతార మాయమయి నటులుండు!

కిన్నెరను ధ్వనియింప కీర్తనలు బాడుచూ
నాముందు నిలుచుండి నర్తనలు జేయుదువు
అంతలో నేమగునో? యా కిన్నెరాపగా
శూన్యమున విరహమున సుక్కిపోవుచునుందు!

అపుడె వెలుగుచు దీప మపుడె కాంతులుమాయు
అపుడె వెన్నెలగాయు! అపుడె చీకటులునూ!
ప్రీతియును విరహమును బెనవేసె మాధవా!
చిత్రమా నీ కథను చిత్రమగు పాత్ర నే!

మనసు దలచినయపుడు మాధుర్య మొలికించి
కనులముందర నిలిచి కలతబాపుదువూ!

# తపియింప జేయుటే

తపియింప జేయుటే తన్మయము కాబోలు!
విరహమున ముంచుటే విధముకాబోలూ!

కన్నీటిలో నీడ గనకాంక్ష కాబోలు!
మధురగీతిని వినగ మనసేమొ మాధవా!

తపియింపజేయుటే తన్మయము కాబోలు
విరహమున ముంచుటే విధము కాబోలూ!

కంటి కగపడని నిను కనులలో జూచుచు!
తపియింతునెందుకో తపసివలె నిరతమును
నిను జెందగా గోరి నీదారి జూచుచును
రాత్రిబవళులు యిటుల రవరవలు యెందుకో?

కన్నీటి పడవలో కదిలిపోవుచు నుంటి
మధురగీతముతోని మాధవా నీ కొఱకు!
వే రమ్ము వెతదీర్ప వేడుకను బాలింపు
పడవ మునుగక ముందు బదిలముగ దరిజేర్పు!

చల్లగాలులు సాక్షి! చంద్రకాంతులు సాక్షి!
కోనలో బాడేటి కోకిలమ్మలు సాక్షి!
నా విరహమెట్టిదో నాథ నీకును దెలియు
మురళిపాటను బాడి మోదమును గలిగింపు!

తపియింపజేయుటే తన్మయము కాబోలు
విరహమును ముంచుటే విధము కాబోలూ!

# నీ వేణునాదాలు

నీ వేణునాదాలు నీ గాన మధురిమలు!
నా మదిని వెలుగొందు నవకోటి దీపాలు!

ఆనంద వీచికలు అణువణువు దాకనూ
సౌందర్య లోకమున చరియించి నటులుండు!

నీ వేణు నాదాలు నీ గాన మధురిమలు!
నా మదిని వెలుగొందు నవకోటి దీపాలు!

మధుమాస చైత్రమున మావులే పూచినటు!
మందార మకరంద మధురిమలు విరిసినటు!
తొలిసంధ్య కుంకుమలు తొలకరించిన యటుల!
నా మనసు చిత్రముగ నాట్యమాడును కృష్ణ!

ఆరిపోయిన యాశ అవతరించిన యటుల
మాసిపోయిన కోర్కె మరల చిగురించినటు!
కన్నీటి బిందువులు కదిలి యెటు పోవునో!
నీ మురళి నాదాలు! నిఖిలేశ! యిటు జేయు!

చెరిగిపోవుమ చింత చిరునవ్వు లుదయించు!
అణిగిపోయిన గొంతు అందాలు గురిపించు!
గుండెలో నా పాట క్రొత్త భావాలతో!
మధురాక్షరాలతో మజిల గీతిని గూర్చు!

నీ వేణు నాదాలు నీ గాన మధురిమలు
నా మదిని వెలుగొందు నవకోటి దీపాలు!

# ఎటనుందువో యనుచు

ఎటనుందువో యనుచు వెదుక నిక శ్రీకృష్ణ!
అంతటా నుందువని యలరి దెలిసితిసే!

ప్రతి జీవిలో గూడ ప్రత్యక్షమయ్యేదవు!
ప్రతి వస్తువందునను బలుకుచుండెదవూ!

ఎటనుందువో యనుచు వెదుకనిక శ్రీకృష్ణ!
అంతటా నుందువని యలరి దెలిసితిసే!

గిరివనములందునా కీర్తనలు బాడుచును
కొండ కోనలయందు గోరి వెదికితిసే!
అందాల నీ మోము అలరి జూడగగోరి!
చూడజాలకపోతి! సుందరంబగు మోము!

నా మనసులోనుండి నాట్యాలు జేయుచును!
నా వెనుక వత్తువని నాథ! దెలిసితినోయి!
ప్రతి జీవియుందునను పాట బాడచు మురళి!
ప్రేమామృతము జింది ప్రీతి జేయుదువంచు!

అలరి నిను బూజింతు అఖిల జీవులయందు
అందాల ప్రకృతిని యలరి నిన్నే జూతు!
ఆరాధనను జేతు అఖిల విశ్వమునందు!
అణువణువు బూజింతు! ఆత్మార్పణం బనుచు!

## ఆషాఢ మేఘమా!

ఆషాఢ మేఘమా! యాలకింపుము సఖీ!
మనసులో నా మాట మమత జిందగనూ!

మది నాదు విరహమును మాధవునితో దెలిపి
జతగూర్చు వేగ మము జాగు నేయక చెలీ!

ఆషాఢ మేఘమా! యాలకింపుము సఖీ!
మనసులో నా మాట మమత జిందగనూ!

దూరదేశమునందు దురవిల్లు చుంటినీ!
కన్నీటి కడవలను గలతతో నింపుచూ!
కనులార్పకను జూచి గగనావ యతనికయి
నిదుర మఱచితి చెలీ! నీరసించితి జూడు!

తలుపు తెఱచీ యుంచి తగవిభుని రాకకయి
ఎదురు జూచీ చూచి వేసారితిని చెలీ!
పవలు రాత్రులు విభుని పలవరింతలు దప్ప
పాట మఱచితి చెలీ! మాట మఱుమాయెనే!

కష్టాలలో నున్న కాంత నను బ్రోవమని
కన్నీటి ధారలను గరిగి దొలగింపమని!
మెఱుపు దీవెలతోని మేఘ గర్జనతోని
చల్లగా వినిపింపు మెల్లగా నా విభుకు!

ఆషాఢ మేఘమా! ఆలకింపుము సఖీ!
మనసులో నా మాట మమత జిందగనూ!

## మాధవా!

మాధవా! ఓ మాధవా!
మాధవా! ఓ మాధవా!

వెన్నెలను తిన్నెనయి
కన్నెవలపు దెలుపుచూ!
విన్నవించుచుంటి కృష్ణ! మనసునూ! నా
మనసులోని మధురమైన కాంక్షనూ!

మాటలోని మాటనై!
పాటలోని పాటనై!
నీడలోని నీడగ నను నిలువనీ!
నీ పాటలోని పల్లవిగా పాడనీ!

చల్లగాలి తరగలో
పిల్లగాలి సొగసులో
మల్లెతీగె నకదిలిసటుల కదలనీ!
నీ చిన్ని పదములందు నన్ను జేరనీ!

ప్రీతియందు ప్రీతినయి
జ్యోతిలోన జ్యోతినయి
రాగబంధమందు నన్ను జేరనీ! నీ
రమ్య మురళి యందు నన్ను గలియనీ!

మాధవా! ఓ మాధవా!
మాధవా! ఓ మాధవా!

## కటికచీకటి తొలగి

కటికచీకటి తొలగి కాంతిరేకలు విరిసి
నా మనసు నిను గలిసి నర్తించునా స్వామి!
నా మనసు నినుగలిసి నర్తించునా!

విరహజ్వాలలు మాసి విప్పారు పద్మముగ
మకరంద పుష్పాదుల మధురిమలు విరియునా?

కటికచీకటి తొలగి కాంతిరేకలు విరిసి
నా మనసు నినుగలిసి నర్తించునా స్వామి!
నా మనసు నినుగలిసి నర్తించునా!

చీకటిని బయనించు
చెలియ వేదన గనవు!
మనసులో దయదలచి
మాటయిన బలుకవూ!

మిట్టపల్లములెక్కి నట్టడవు లందునా
నిట్టూర్పు లిడుచుంటి నీ దయలు రావుగా!

అందాలకృష్ణ! నను నాదుకొను కరుణించి
చేయూతనిచ్చి నను జేర్చుకొను ప్రీతితో!
వెన్నెలా వర్షమును వేగ గురిపింపుచూ
బంగారుబాటలో బ్రతుకు బయనింపగా!

కటికచీకటి తొలగి కాంతిరేకలు విరిసి
నామనసు నిను గలిసి నర్తించునా స్వామి!
నా మనసు నినుగలిసి నర్తించునా!

# అందాల జాబిల్లి

అందాలజాబిల్లి! యెంత సంతసమేల?
వెన్నెలలు గురిపించి వేడుకలు జేసెదవు!

పతి విరహమునగుందు సతుల తాపము బెంచి
కన్నీటి కొలనులను గలువలను గాంచనా?

అందాల జాబిల్లి! యంత సంతసమేల?
వెన్నెలలు గురిపించి వేడుకల జేసెదవు!

హరిని బతిగాపొంద యందాల బయలులో
దపమాచరించేటి తన్వినోయ్! జాబిల్లి!
వెన్నెలా సూదులను వేడుకను సన్నగుచ్చి
వ్రతభంగముసు జేయ వన్నెయగునా నీకు?

పాలజల్లులు జల్లి బంగారు గలువలను
వశిబఱచు కొనినటుల వన్నెలా చందురుడ!
పరవనితలను జూచి పరిహాసమాడకుము
శాపమిత్తురు సుమా! చెరిగిపోవగ కళలు!

మధుమాస మొచ్చినా మావి జిగురించినా
కొండకోనలలోని కోకిలలు గూసినా!
పదునాఱుకళల నీ పాలవెన్నెలయందు
నను ముంపు! నే విడను నా విభుని వ్రతదీక్ష!

అందాలజాబిల్లి! యంత సంతసమేల?
వెన్నెలలు గురిపించి వేడుకలు జేసేవు!

## ఒకసారి నీ మురళి

ఒకసారి నీ మురళి యొయ్యార మొలుకగా
కదిలించి ప్రేమాయింపు కమ్మగా కృష్ణా!
కలిసి నే బాడెదను కమనీయ గాత్రమున
లయ తాళ రాగముల లలితగీతము నొకటి!

ఒకసారి నీ మురళి యొయ్యార మొలుకగా
కదిలించి ప్రేమాయింపు కమ్మగా కృష్ణా!

వెన్నెలా దారాలు వేడుకను భువి జార
గగనాన ముత్యాలు కదిలి మాలికగాగ!
చిన్నారి పూలతలు జెలగి పూవులుబూయ
నన్నగాలులువీచి చలనమొందగ ప్రకృతి!

హరివిల్లు దా విరిసి యందాలు బూచినటు
హిమబిందువులతోని వికసించు బచ్చికలు
కలువ కన్నెలతోని కల హంస లాడినటు
మబ్బుచాటున సంజ మధురిమలు జిందినటు!

మురళిలో నే గలిసి మురిపాలు జిందుదును
కమ్మనీ స్వనములను గలిసి నటియించెదను!
నా పాటతో నేను నాట్యమాడుచు కృష్ణ!
కలిసిపోయెద నీదు కమనీయ జ్యోతిలో!

ఒకసారి నీ మురళి యొయ్యార మొలుకగా
కదిలించి ప్రేమాయింపు కమ్మగా కృష్ణా!

# కదిలిపోయే నావ

కదిలిపోయే నావ! కాసింత నిలువవే!
విభుజూచి కనులార! వేగయిపుడొత్తూ!

బ్రతుకంత యతనికయి బాధతో గడిపితిని
వచ్చెదనివింటి యీ వగలాడు మాధవుడు !

కదిలిపోయే నావ! కాసింత నిలువవే
విభుజూచి కనులార వేగ యిపుడొత్తూ!

కన్నీటి భాష్పముల
కడవలను నింపితిని!
విభుని పదముల గడిగి
వేగ యిపుడొచ్చెదను!

మధుర పదములతోని
మాలగా గూర్చితిని!
విభునికర్పించి నే
వేగ వచ్చెద నిపుడ!

నా నోము ఫలియింప నా కోర్కె లీడేర
నా విభుడు నా యెదుట నయగార మొప్పగా!
కలత నలతల ద్రోసి కన్నార విభుగాంచి
ఆనందసుధలలో నటు మునిగి యిటువత్తు!

కదిలిపోయే నావ కాసింత నిలువవే
విభుజూచి కనులార వేగ యిపుడొత్తూ!

# మనసెంతో మధురమని

మనసెంతో మధురమని మాధవీలత దెలుప
ముల్లోకముల పొడవు మురిసితిని కృష్ణా!
మనసులోపల నిలిపి మధురిమలు దొలుకగా
పతినంచు నినుదలచి సతిగ నే మారితిని!

మనసెంతో మధురమని మాధవీలత దెలుప
ముల్లోకముల పొడవు మురిసితిని కృష్ణా!

మనసులో నీ సొగసు
మధురముగ చిత్రించి!
అతికించితిని స్వామి
అందాల చిత్రముగ!

అందాలు జిందేటి
అపురూప శిల్పముగ!
చెక్కితిని మనసులో
శిథిల మవ్వని రీతి!

నీ రూపలావణ్య నిఖిల సౌందర్యమును
కనులార భావించి కమ్మని గీతముల!
పాడి యాడుచునుంటి పారవశ్యముతోని
ఏల నీ దయరాదు? నిండుగా సతిపైని!

మనసెంతో మధురమని మాలతీలత దెలుప
ముల్లోకముల పొడవు మురిసితిని కృష్ణా!

## అతికిపోయెను మనసు

అతికిపోయెను మనసు అందాల కృష్ణునీ
విడిచిరా లేనమ్మ విభుడాయె సతతమూ!

సతినయితి సతని నే సరస గీతములతో
ఆడిపాడుచునుంటి అచ్చరగ దివిలోని

అతికిపోయెను మనసు అందాలకృష్ణునీ
విడిచిరాలేనమ్మ విభుడాయె సతతమూ!

నీల వర్ణముతోని నిండారు కన్నులను
నెమిలిపింఛము నుదుట నిగనిగలు జిందగా!
మురళిబాడుచు జగతి మోదమున ముంచేటి
మాధవుని యెటుమఱతు? మన్నింపవే చెలీ!

గతజన్మ జేసినా గలనోము ఫలమేమొ
ఈ జన్మబొందినా విప్ర దీవెనలేమొ!
తరువులకు దీవెలకు దగ నీరువోసినా
ఫలితమై మాధవుని బాంధవ్య మదిగలిగె!

అతని సుందరములో నానందమున గలిసి
యతని మురళిని గలిసి అందాల స్వనమునై!
విశ్వమంతా మ్రోగి విమలతను వెదజల్లి
అమలత్వమును బొంది యలరుదును గీతిగా!

అతికిపోయెను మనసు అందాలకృష్ణునీ
విడిచిరాలేనమ్మ విభుడాయె సతతమూ!

# ఎందుకో కృష్ణునీ

ఎందుకో కృష్ణునీ యిలవేల్పుగా దలప
ఆత్మబంధువునిగా నలరి భావింతూ!
నను దీరమున జేర్పు నావికునిగా దలచి
సర్వమర్పించి నే సఖినయితి నిజముగా!
ఎందుకో కృష్ణునీ యిలవేల్పుగా దలప
ఆత్మబంధువునిగా నలరి భావింతూ!

నా బ్రతుకుబాటలో నా శాంతియాత్రలో
కాంతిరేఖగ జూచి కనుగొందు గమ్యమును!
అతని కనుసన్నలను నలరి ముందుకు నడుతు
పూలబాటలయందు పున్నమి వెన్నెలల!

చెలికానివలె నాదు జెంతనుండును సఖ
ఆదుకొను నన్నెపుడు నాత్మీయతనుజింది!
బాంధవునివలె నాదు బరువు భారమునంత
మోయుచుండును చెలీ! మోదమున హర్షమున!

ఎందుకో నామీద యందాలకృష్ణునికి
వలపెందుకో! యింత వయ్యారమెందుకో?
దాసినై తిని! యతడు దయతోని పతియయ్యె!
ఆత్మ పరమాత్మలా యంతరము కాబోలు!

ఎందుకో! నే నతని యిలవేల్పుగా దలప
ఆత్మబంధువునిగా నలరి భావింతూ!

## కొంగు బంగారమును

కొంగుబంగారమును గొసరింత లేకుండ
ఆశ్రయించితి చెలీ! యతని కర్పించి!

దాసిగా నన్నుబ్రోవ దయను వర్షింపమని
విన్నవించుచునుంటి! విభునిలో నే గలియ!

కొంగుబంగారమును గొసరింత లేకుండ
ఆశ్రయించితి చెలీ! యతని కర్పించి!

కిన్నెరను జేబట్టి కీర్తనను బాడుచును
వీధివీధుల దిరిగి విభుని వెదుకుచునుంటి!
లలిత గీతికలతో లాలిత్య మొలుకగా
ముత్యాలదండగా మురిపాల పదములను!

హరివిల్లుగా నతని యందాల గనుగొనుచు
అణువణువు ప్రకృతిని యతనిగా జూచుచును!
సర్వజీవులలోని సౌందర్యమంతయును
మాధవునిదే యనుచు మదిని నుప్పొంగుచును!

కనుసన్నలను జూచి కరుణింపకున్ననూ
మధుర మురళిని జేర్చి మన్నింపకున్ననూ!
నేనతని వలచితిని! నిండయిన మనసుతో
కరుణనేలిన సరే! కాదన్న సహియింతు!

కొంగుబంగారమును గొసరింత లేకుండ
ఆశ్రయించితి చెలీ! యతని కర్పించి!

## కలలోని స్మృతులన్నీ

కలలోని స్మృతులన్నీ కఱిగిపోవుచు నుండ!
విప్పి జెప్పగలేను! వివరించి చెలియా!

మనసు బొందిన దివ్య మధురానుభూతులను
విమలమగు గీతిలో వివరింపలేనే!

కలలోని స్మృతులన్నీ కఱిగిపోవుచునుండ!
విప్పి జెప్పగలేను వివరించి చెలియా!

మాధవుని మురళిలో మధురమా స్వరమునై
ఆకాశ మంతటను నలరి నే దిరిగి నటు!
నీలి గగనమునందు నిలిచి చుక్కలతోని
ఆడిపాడిన యటుల నణిపించె నా మదికి!

బృందావనములోని యందమగు సురపొన్న
యందాల నీడలను నలరి విహరించి నటు!
తా మురళి బాడినటు దగ గీతి నే బాడ
తరులతలు వనవీధి తన్మయత బొందినటు!

చిఱు దీప కళికనయి చిన్నారి కృష్ణునీ
వేల కాంతులలోని వెలుగులో గలిసినటు!
నాదమై మురళిలో నవ్యతను నే బొంది
విశ్వమున గలిసినటు విమలతను గాంచినటు

కలలోని స్మృతులన్నీ కఱిగిపోవుచునుండ!
విప్పి జెప్పగలేను! వివరించి చెలియా!

# వన వీధిలో విభుడు

వన వీధిలో విభుడు వన్నెలను జిందుచూ
మురళి మ్రోగించుచును మోదమున నుండే!

మెల్లగా నా గీతి చల్లగా వినిపించి
ముద్దుగా నా కోర్కి మోదమున దెలుపుదును!

వన వీధిలో విభుడు వన్నెలను జిందుచూ
మురళి మ్రోగించుచును మోదమున నుండే!

కోకిలగ నే మారి కొమ్మలో రెమ్మలో
పాట బాడుచు విభుని పరమ దయ యాచింతు!
నా పాట వినునేమొ! నవ్వ సుందరమైన
మురళి పాటను వింద! మోమయిన బరికింతు!

మాలతీ లతలందు మల్లె పూ పొదలందు!
విభుని దాపుకు జేరి విహరింతు హంసనై!
ఒడిని నను జేర్చుకొని యొలికించునా దయను!
ప్రేమతో నను దువ్వి ప్రియమార జూచునా!

అతడు నడిచే దారు లందందు పూవునై
పాదములను స్పృశియింతు పల్లవిని బాడుదును!
జన్మజన్మల పాప కర్మములు నశియింప
పాద ధూళివి దాల్తు బరగ నా శిరమందు!

వన వీధిలో విభుడు వన్నెలను జిందుతూ
మురళి మ్రోగించుచును మోదమున నుండే!

## మంచు తెరలవి మాసి

మంచు తెరలవి మాసి మది పులకరించేనా?
ఆకురాలే కాల మంతరించేనా?

పాడేటినా విరహ గీతి కృష్ణుపలకంది
పలుకునా మురళితో పరవశము నే కొంద!

మంచు తెరలవి మాసి మది పులకరించేనా?
ఆకురాలే కాల మంతరించేనా?

కన్నీటి వాగులో కలిసి ప్రవహించేటి
ప్రేమ లేఖను జదివి ప్రియుమార జూచునా?
వేదనను దెలిసికొని విన్నపము నాలించి
పదిలముగ నన్నతని పదములను జేర్చేనా?

మసక జీకటులలో మణిగున్న నను దెలిసి
కాంతి కిరణములతో కలగుండు దీర్చునా?
నా మధుర గీతమును నను మఱల బాడుమని
స్నేహ మాధుర్యమును దేల్చునా నా స్వామి!

వాసంత మొచ్చేనా? వన్నెలే విరిసేనా?
మలయ మారుతమందు మది పొంగిపోయేనా?
ఆకులో పూవులో అందాలు విరిసేనా?
నా హృదయ వల్లభుడు నను మదిని జేర్చేనా?

మంచు తెరలవి తొలగి మది పులకరించేనా?
ఆకురాలే కాల మంతరించేనా?

## పాడగా! బాడగా!

పాడగా! బాడగా! బల్ల విని మఱచితిని!
గొంతు తడి యారినది! గోవింద! నిజముగా!

సుకుమార నాదాల సుందరంబగు వీణ
తంత్రులన్నీ చెదిరి తపసిగా మారినది!

పాడగా! బాడగా! బల్ల విని మఱచితివి!
గొంతు తడి యారినది! గోవింద! నిజముగా!

సుందరంబగు పూల యందాలు మాసినవి!
భుపాదుల చందాలు! బులకరింపులు చెదిరె!
కనుల ముందర గూడ గటిక జీకటి తెరలు
వేధించుచుండె నను విడువకను బ్రతిక్షణము!

కన్నీటి కొలనులో గలువలే వికసించె!
మనసులో నా గీతి మధురిమలు కృశియించె!
తీయనీ భావాలు దేనెలొలుకుట మానె!
నంజకాంతుల మనసు నరసతను గోల్పోతి!

ఎక్కడున్నా రమ్మ! చక్కనీ గోపాల!
చిక్కనీ నా ప్రేమ చింతనల గొనిపొమ్మ!
విరహ జ్వాలల సెగల వేధింపబోకుమా!
కనికరింపుము కృష్ణ! కమ్మనీ చూపులను!

పాడగా! బాడగా! బల్ల విని మఱచితిని!
గొంతు తడి యారినది! గోవింద! నిజముగా!

## వేదనల గూటిలో

వేదనల గూటిలో విలపించు పక్షినీ
కన్నీరు మున్నీరు గలిసి ప్రవహించే!

ఎదురు జూచుచునుంటి సదయ నీ రాకకై
దివి భువిని దిక్కులను దిశలన్ని బరికించి!

వేదనల గూటిలో విలపించు పక్షినీ!
కన్నీరు మున్నీరు గలిసి ప్రవహించే!

కోనలో కూయంచు కోకిలలు బాడినా
పంజరములో చిలుక బలికినా చిగురాకు!
గాలి కల్లాడినా కనుగొందు ద్వారమును
నీరాకయని మదిని నిగిడి జూచుచునుందు!

నిర్మలాకాశాన నీలి మబ్బులయందు
మెఱువు దీవెలలోని మేలికాంతులయందు!
అందాల హరివిల్లు వలరు రంగులయందు
నిండియున్నావంచు నిలిచి బరికించెదను!

సంధ్యకాంతులయందు సరస గీతికలయందు
ఆలయంబున మ్రోగు వలరు ఘంటికయందు
అంబుధిని వినిపించు నలల హోరులయందు
నీ రాకయని మదిని నిలిచి చూచుచునుందు!

వేదనల గూటిలో విలపించు పక్షినీ
కన్నీరు మున్నీరు కలిసి ప్రవహించే!

# నే విడువలేనమ్మ

నే విడువలేనమ్మా! నే వదలలేనే!
నా చిన్నికృష్ణునీ! నా పూర్వసఖునీ!
అందాలపెన్నిధిని యతిలోక సుందరుని
మురళి మ్రోయించు నా ముద్దుగోపాలునీ!
నే విడువలేనమ్మా! నే వదలలేనే
నా చిన్నికృష్ణునీ! నా పూర్వసఖునీ!

ఎన్ని జన్మలనుండి సన్నిధానము నొంద
కిన్నెరను మీటుచూ కీర్తనల బాడితిని!
కన్నెత్తిజూచి నను గనికరింపకపోని
వదలజాలను సఖీ! వన్నెలా కృష్ణునీ!

మురళి నిస్వనములను ముద్దుగావినుచు నే
అందాల మాధవుని యతికిపోయితినమ్మా!
వేయిమాటలు బలుకు విడిచి రాలేనతని
వేణువున నేనొక్క విమలస్వనమైతినీ!

తారనయి, తళుకునయి, తగ చందమామనయి
వెన్నెలను కురియుచును, దిన్నెలను దాకుచును!
కొంగుముడి వేసికొని గోపాలబాలునీ
యంటి యుండెదచెలీ! జంటగా నెల్లవుడు!

నే విడువలేనమ్మా! నే వదలలేనే!
నా చిన్నికృష్ణుని! నా పూర్వసఖుని!

# కనులలో కదలనీ

కనులలో కదలనీ కమనీయ మగు రూపు
మనసులో మెదలనీ మాధవా సొగసు!

మధుర పదములతోని మంగళంబగు గీతి
గొంతులో పలికింపు కోకిలాపాటగా!

కనులలో కదలనీ కమనీయమగు రూపు
మనసులో మెదలనీ మాధవా సొగసూ!

ఎన్ని వసంతాలు మల్లెలను బూజించి
విన్నవించితి నాదు విన్నపము వినుమనుచు
ఎదురుగా నొకనాడు గూర్పవుగ మోదమును
కనులముందట నిలిచి కాంక్ష దీర్పవుగదా!

అందాల నీ సొగసు అలలుగా దరలుగా
మనసు తీరముదాకి మదినిలిచి పొమ్మనుచు!
అద్దమున నీడగా నతికి పొమ్మనుచునూ
విలపించు నాగీతి! వినిపింపదా స్వామి!

నా భావగీతమును నే నెపుడు పాడునటు
నీ మురళి స్వనములను నాకెపుడు వినిపింపు!
నీయందు కిరణముగ నే గలిసిపోవాలి
పూజకయి నేనొక్క పూవుగా మారాలి!

కనులలో కదలని కమనీయమగు రూపు
మనసులో మెదలనీ! మాధవా నీ సొగసు!

# మాధవా నిను బలిమి

మాధవా! నిను బలిమి మలుచుకుంటిని హృదిని
బందీని జేసితిని భావమందుననూ!

ఎటుబోదు విక నన్ను విడిచి దూరము కృష్ణ!
ఇట నుండవలెనోయి మటుమాయమవకనూ!

మాధవా! నిను బలిమి మలుచుకుంటిని హృదిని
బందీని జేసితిని భావమందుననూ!

నీ మురళినాదమును నీ మధుర స్వనములను
నా లలితగీతమున నవ సుందరాకృతిని!
పెనవేసుకొంటిగద ప్రీతి బంధముతోని
ఎటుబోయెదో జూతు నింపుగా నను విడిచి!

తేనెలొలికే తెలుగు తీయన పాటలను
పరిమళము వెదజల్లు పారిజాతములతో!
బంధించితిని నీదు పదములను భక్తితో
అడుగు వేయగలేవు అటుకదిలి యిటుకదిలి!

ఏడేడు పదునాల్గు ఎన్ని జన్మలకయిన
ఇట నుండవలెనోయి యెటుబోవకను కృష్ణ!
అందుకే! కరుణించి యులరించి నను బ్రోచి
జ్యోతిలో జ్యోతిగా బ్రీతి జేకొనుమోయి!

మాధవా! నిను బలిమి మలచుకొంటిని హృదిని
బందీని జేసితిని భావమందుననూ!

## పిల్లనాగ్రోవితో

పిల్లనాగ్రోవితో బిలువకోయీ కృష్ణ!
మది విరహ జ్వాలతో మసిలిపోతోంది!

భస్మమైపోదు నే భావ బంధురమైన
లాలిత్యమొలుకు నా లలిత గీతముతోని!

పిల్లనాగ్రోవితో బిలువకోయీ కృష్ణ!
మది విరహ జ్వాలతో మసిలిపోతోంది!

కొండ కోనలలోని నిండు వెన్నెలలోన
మల్లె పూ పొదలందు మాధవ్వి లతలందు!
ఎటనుంటివోగాని యిటు రావు! ఒకసారి
మనసిచ్చి! మాటాడి! మధురిమలు నింపవూ?

పిల్లనాగ్రోవితో బిలుచుచుందువుగాని
కన్నార నను గాంచి కాంక్ష దీర్చవుగా!
పిలుచుటెందుకు స్వామి? కలత గూర్చుటదేల?
చెన్నార మురళితో జేరదీయగ రాద!

చిరు గజ్జెయలతోని చెన్నార యిటువచ్చి
మనసార కనిపించు మాధవా! దయతోని!
మోము జూపక నన్ను మోసగించిననైన
బదములై నను జూవు! బరికింతు గోపాల!

పిల్లనాగ్రోవితో బిలువకోయీ స్వామి!
మది విరహ జ్వాలతో మసిలిపోతుంది!

## నా హృదయ మందిరము

నా హృదయ మందిరము! నవకాంతి నిలయమై
లలిత కళలను విరిసి లాలిత్యమొలికే!

నీవు నిలిచినచోట నిఖిల సౌందర్యముల
ఆనంద ధామముగ యలరారుగద స్వామి!

నా హృదయ మందిరము నవకాంతి నిలయమై
లలిత కళలను విరిసి లాలిత్యమొలికే!

సరస వాగ్దేవతా సాహితీ గీతికలు
నా మదిని ధ్వనియించె నవరాగ తాళముల!
చిరు గజ్జియల ధ్వనులు జిందినవి మధురముగ!
నాట్యశాలగ మారె! నా హృదయ మందిరము!

నవ రంగులను దొలికె రమణీయముగ నీదు
చిత్రపటములు నిలచె చెన్నుగా మనసంత!
కదులుచును బలుకుచును గరుణలో వీక్షించు
గాచి రక్షించేటి కమనీయ రూపాలు!

కోవెలగ మారినది కోటి శిల్పాలతో
అచ్యుతా! నీ రూప మందచందాలతో
చిత్రమును జేసితివి! చిత్రాతిచిత్రముగ
లలిత కళలను నిండు లావణ్య సౌధముగ!

నా హృదయ మందిరము! నవకాంతి నిలయమై
లలిత కళలను విరిసి లాలిత్య మొలికే!

# విశ్వమంతయును నేలు

విశ్వమంతయును నేలు వేణు గోపాలుడా!
నా జన్మ సఖుడమ్మ! నా పూర్వ సఖుడా!
కలిసి యుంటిమి నాడు కలత నలతలు లేక
జ్యోతిలో జ్యోతిగా ప్రీతిగులికితిమమ్మ!
విశ్వమంతయునేలు వేణుగోపాలుడా!
నా జన్మ సఖుడమ్మ! నా పూర్వ సఖుడా!
కర్మబంధము జేత గడకు నే ద్రోయబడి
విలపించుచుంటి నిటు వేయి జన్మలుగాన!
రాత్రి బవళులు నతని నామమును దలచుచును
కనురెప్ప లార్పకను గాంచుచుంటిని చెలీ!
తప్పు మన్నింపుమని! దయను గాపాడుమని!
నీ స్నేహమును విడిచి నేనుండ లేననుచు!
పద్మ వ్యూహమునుండి బయట బడ వేయమని
అర్చించుచుంటి నిటు నాత్మార్పణముతోని!
మధుర గోపికనుగా మారితిని యతనికయి
నతినంచు పతివంచు నరన గీతికలతో!
కిన్నెరను జేబట్టి కీర్తనలు బాడుచును
ఆల మాధవుని జేర నారాట బడుచుంటి!
ఒకనాడు దా వచ్చు! నొయ్యార మొలికించు!
కనులార ననుగాంచు! గారుణ్య మొలికించు!
మురళి గానముతోని మోహమంతయు దీర్చు!
తనలోన గలుపుకొను దన్మయము నొంద నే!

# మనసులో నున్న నిను

మనసులో నున్న నిను మాధవా! యెటుగాంతు!
కంటికగబడరాద! కరుణ నొకసారి!

సకల జీవుల నున్న సర్వాత్మకుడవుగద!
ఏ రూపు నీ రూపు? నెటుగాంతు గన్నార?

మనసులో నున్న నిను మాధవా! యెటుగాంతు!
కంటికగబడరాద! కరుణ నొకసారి!

అణువణువు నీవేను నఖిలాండ మంతయును
అర్కేందు తారకలు నాకాశ మంతయును!
ఇన్ని రూపాలతో నింపొందు వి న్నెటుల
దరిజేరి దర్శింతు? దయగోరి యాచింతు?

చిన్ని గోపాలునిగ జేసితిని చిత్రముగ
మధుర మురళిని యిచ్చి మాధవా! యనియంటి!
నీ మురళి స్వనములను నే నాట్య మాడుచును
పాట బాడుచు నుంటి పారవశ్యము జెంది!

నీ యనంతమునందు నేనొక్క రేణువును!
నీ కాంతి జ్యోతిలో నేనొక్క కిరణమును!
అఖిలేశ్వరా! నిన్ను ఆలమందను గాయు
గోపబాలుసజేసి కొలుచుచుంటిని కృష్ణ!

మనసులో నున్న నిను మాధవా! యెటుగాంతు!
కంటికగబడరాద! కరుణ నొకసారి!

## మఱచిపోనీకు నిను

మఱచిపోనీకు నిను మాధవా! నన్నెపుడు
విడిచిపోనీకు నీ విమలగీతములా!

అనుసరింపగనిమ్ము నమలమగు నీ త్రోవ
అందాల శ్రుతిలయల నందుకొన నీ మురళీ!

మఱచిపోనీకు నిను మాధవా! నన్నెపుడు
విడిచిపోనీకు నీ విమల గీతములా!

కొండ కోనలయందు కోనేరు టంచులను
ఇసుక తిన్నెలపైని మసక సంధ్యలయందు!
జాలేటి శశికిరణ జాలులో గోకిలగ
నీపాట నేబాడ నేర్పు నా కొనగుమా!

నన్నునీ గాలులకు వన్నెలా పూలవయి
వలయముగ దిరుగుచును వన్నెలను జిలుకుచూ!
వనవీధి యంతటను వయ్యార మొలికించు
తుమ్మెదగ ననుజేసి తొలికించు నీ గీతి!

కనుసన్నలను నన్ను గరుణతో జూడాలి!
ప్రియమైన దాసినని ప్రేమ లొలికించాలి!
బంగారు ము॰ళిలో పొంగారు రవములను
స్వనము నగునటుల నను సరసతను జూడాలి

మఱచిపోనీకు నిను మాధవా! నన్నెపుడు
విడిచిపోనీకు నీ విమల గీతములా!

# వగలాడ నీ పొందు

వగలాడ నీపొందు వదల నే నందాక!
మనసు మనసూ కలిసి మాయమగుదాకా!

నీ మురళి రవములను నే స్వనము నగుదాక
నీ కాంతి జ్యోతిలో నే కిరణమగుదాక!

వగలాడ! నీ పొందు వదల నేనందాక!
మనసు మనసూ కలిసి మాయమగుదాకా!

మబ్బుచాటుకు పొమ్ము మరుభూములకు పొమ్ము
నీతోనియుందు నే నీవెంట నంటెదను!
చుక్కలను రిక్కలను జ్యోత్స్నముగ నున్ననూ
పరువెత్తి వచ్చెదను బలుతావులకు పోక!

పాతాళమున నున్న పరగ నీ వెనుక నే
స్వర్లోకమున నున్న నరుదెంతు నీ వెనుక!
అంబుధిని దాగున్న నరుదెంతు వేగమున
అల నగుచు తెర నగుచు అణిముత్తెము నగుచు!

స్నేహమట్టిది స్వామి! చెరిగిపోనిది విభూ!
కలకాల బంధమిది! చిరకాల వలయమిది!
కలువుకొను కరుణతో కార్పణ్యమును మాని
అందాక నే విడను నాత్మేశ్వరా నిన్ను!

వగలాడ! నీపొందు వదల నే నందాక
మనసు మనసూ కలిసి మాయమగుదాకా!

# కన్నీటి నొలుకలే!

కన్నీటి నొలుకలే! కలతజెందను సఖీ
విరహగీతిక బాడి వేసారబోనులే!

కమ్మనీ కలలలో కాంతుని జతగూడి
విహరింపబోనులే వేడుకొనబోనులే!

కన్నీటి నొలుకలే! కలతజెందను సఖీ!
విరహగీతిక బాడి వేసారబోనులే!

కిన్నెరను వదిలితిని! కీరమును వదిలితిని!
బరువుగా గుండెపై భారమును మంచితిని!
గొంతులో రాగాల కొన ద్రుంచి వేసితిని
భావాల పూతీగె బడనేల పైచితిని!

కమ్మని వెన్నెలలు గానరాకుండగా
మధుర సంధ్యలలోని మధురిమలు గనకుండ!
గాంధారివలె నాదు కనులంట గట్టుకొని
వ్రతము జేయుచునుంటి శతపత్ర పుష్పముల!

ఉపచార మదియేల? ఓదార్పు లేలనే?
మాధవుని నే గలియ మౌన మూనితినమ్మ!
మురళి నిస్వనముగా మోహనుని జేరగా
దీక్ష బూనితినమ్మ దివ్యత్వమును జెంద!

కన్నీటి నొలుకలే! కలతజెందను సఖీ!
విరహగీతిక బాడి వేసారబోనులే!

## అల్లరీ కృష్ణునీ

అల్లరీకృష్ణునీ అందుకోలేనమ్మ
అటుద్రిప్ప నిటుద్రిప్ప నంతలో మాయమగు!

దివి భువిని దిక్కులను దిశలన్ని నన్ద్రిప్ప
అందాల ననుముంచి యలరించు మురళితో!

అల్లరీకృష్ణుని అందుకోలేనమ్మ
అటుద్రిప్ప నిటుద్రిప్ప నంతలో మాయమగు!

తొలిసంధ్య మలిసంధ్య తోరణములను జేర్చి
రంగురంగుల పూల రమ్యతలు జూపునే!
నీలి మబ్బులయందు నిలిపి నన్నొంటరిగ
నాట్యాలు సలుపునే సవ్యతలు విరియగా!

తళుకు తారలయందు వెలుగు చంద్రికలందు
మేఘ మాలికలందు మెఱుపు దీవెలయందు!
కొండ కోనలయందు గోకిలల గుంపులో
నన్నొదిలి మాయమగు నాతి యేమందునే!

మనిషినని తలచడే మాధవుడు నిసుమంత
తననుగా ననుజూచి తరలించు నెటకయిన!
కొంగుముడి వేసికొను కోమలీ నిజముగా
ఎంతప్రేమోగాని కాంతునకు నాపైని!

అల్లరీకృష్ణుని అందుకోలేనమ్మ
అటుద్రిప్ప నిటుద్రిప్ప నంతలో మాయమగు!

## చీకటి తెరలను

చీకటి తెరలను జిందెదవేలా?
కాటుక తెరలను గనబఱచెదవూ!

సంధ్య వెలుగులను గ్రమ్మఱజూపీ
సరసత్వమునూ వెలయించెదవూ!

చీకటి తెరలను జిందెదవేలా?
కాటుక తెరలను గనబఱచెదవూ?

ఆకురాలు శిశిరముగా జేసీ
యలత జేయుదువు యంతరంగమును!
చివురుల పువ్వుల చిత్ర వసంతము
మఱల గనబఱచి మధువు లొలికెదవు!

కారుమబ్బులను గ్రమ్మిన నింగిని
కాంతిరేఖలను గనబఱచెదవూ!
మాసిన చంద్రుని మఱల జూపి మది
మధుర భావనలు వెలయించెదవూ!

తిన్నని దారుల నను నడిపించీ
తీయని మురళిని నను బులకించీ!
జ్యోతి జ్యోతినీ కలువుకొనుమోయి!
ప్రీతి విడువనీ ప్రేమబంధ మిది!

చీకటి తెరలను జిందెదవేలా?
కాటుక తెరలను గనబఱచెదవో!

## క్షణక్షణము

క్షణక్షణము నినుదలచి సన్నుతించుచునుంటి
మధుర గీతములతో మన్నింపుమనుచూ!

నను మఱచిపోతివీ! నాథ యే శాపమో?
అనుభవించుచునుంటి ఆటుపోటుల నిటుల!

క్షణక్షణము నినుదలచి సన్నుతించుచునుంటి
మధుర గీతములతో మన్నింపుమనుచూ!

మావికొమ్మను వీడు మాధవీలతవోలె
కలిపియున్నా నాకు కష్టాలు సమకూడె!
వేఱుబడితిని స్వామి విడిపోతి నీనుండి
కాంతి రేఖలనుండి కలవరపు జడిలోకి!

అందాల నీయెదను సలరినా నేనిపుడు
కిన్నెరను చేబట్టి కీర్తనల బాడుచును!
వీధివీధుల దిరిగి! వాడవాడల నరిగి!
విలపించుచుంటిని వేదనల రోదనల!

నిను మఱల గలియగా నిండారుభక్తితో
మధురభక్తిని బాడి మాధుర్యమొలుకగా!
వినతిజేయుచునుంటి వేయి నాలుకలతో
కరుణ పొంగార నను గారవింపుము కృష్ణ!

క్షణక్షణము నినుదలచి సన్నుతించుచునుంటి
మధుర గీతములతో మన్నింపుమనుచూ!

## ఎందుండి వచ్చెనో

ఎందుండి వచ్చెనో సుందరంబగు చిలుక
పొందుగా జెప్పెనే పురుషోత్తముని మాట!

చిందకని వేదనను జిగురాకు మాటలను
పొందుగా జెప్పెనే పురుషోత్తముని మాట!

ఎందుండి వచ్చెనో సుందరంబగు చిలుక
పొందుగా జెప్పెనే పురుషోత్తముని మాట!

కన్నీటిధారలను కడలి కలుపకుమనుచు
మనసులో బోగమంచు మాపివేయు మటంచు!
విరహాగ్ని జ్వాలలను వినువీధి కెగయగా
చుక్కలను రెక్కలను సుడులు ద్రిప్పకు మనుచు!

పడతి రోదింపకుము ప్రభు రాగలడు వేగ
వాసంతి తీవవలె వన్నెలొలికెడ వింక!
వైజయంతికి వోలె వక్షమున ధరియించి
గారవింపగలాడు కమ్మనీ దయతోని!

ఉదయసంధ్యకువోలె నొప్పెదవు నికపైని
పసిడి కాంతులతోని మిసమిసలు జిందెదవు!
స్వామిదయ గలిగెనని సరసరీతిని దెలిపి
రివ్వుమనె రాచిలుక జివ్వుమన నా మనసు!

ఎందుండివచ్చెనో సుందరంబగు చిలుక
పొందుగా జెప్పెనే పురుషోత్తముని వార్త!

# గాఢ నిదురను నున్న

గాఢ నిదురను నున్న కలలలో మునిగున్న
నీ మురళినాదాలు నే విందు స్వామీ!

దూరాన వినిపించు కోకిలా గతిలా
పారేటి సెలయేటిపాటలా గనిపించు!

గాఢనిదురను నున్న కలలలో మునిగున్న
నీ మురళినాదాలు నేవిందు స్వామీ!

మబ్బుచాటుననున్న మసకచంద్రునిలాగు
కనిపించు నీమోము వినిపించు నీ మురళి!
ఆకులో పూవులో అందాల తీవెలో
వనవీధియంత నీ వన్నెలే గనుగొందు!

దిశలన్ని వినిపించు దివ్యమా నీ మురళి
ఎటుజూచినా గూడ నిటుజూతువోయ్ కృష్ణ!
నీ మురళితో గలిపి నే పాటబాడగా
నిలువవుగ యొకచోట నిర్మలముగా కృష్ణ!

ఈ విరహవేదనను నెటుల నే భరియింతు
అణువణువులయిపోయె యంతరంగంబంత!
కెవ్వుమని నాకేక రివ్వుమని గాలిలో
వినిపించునా కృష్ణ! కనికరము గలుగునా?

గాఢ నిదురనునున్న కలలలో మునిగున్న
నీ మురళినాదాలు నే విందు స్వామీ!

# అందరీ ముందు

అందరీ ముందు నే నలరి బాధ నటంచు
అలిగి పోతిని గదా! ఆనాడు కృష్ణా!

ఎవరు వినరాదని! ఏకాంత గీతమని!
తెలుపనలేనా స్వామి! తెలియదా గోపాల!

అందరీ ముందు నే నలరి బాధ నటంచు
అలిగి పోతిని గదా! ఆనాడు కృష్ణా!

చిననాడె నీ రూపు చివురాకు వేసినది!
నిన్ను వలచితి గదా! నిండారు మనసుతో!
మనసు నర్పించితిని మధుర గీతికతోని
పూలు పూచిన ప్రేమ! పులకరించిన వలపు!

నలుగురితో నేను నా మనసు వివరించి
ఎటుల పాడుదు స్వామి! యేకాంత గీతికను!
నా వ్రేలి నైకొనవు! నలుగురును జూడగా
నీ మురళితో నన్ను నిండార గాంచవూ?

పల్లకీ వే బంపు! పయనమయి వచ్చెదను
అర్ధాంగినై నేను ఐక్యమై పోయెదను!
అపుడె పాడెద కృష్ణ! ఆకాశ వీధిలో
అందరూ వినునటుల ఆనంద గీతికను!

అందరీ ముందు నే నలరి బాధ నటంచు
అలిగి పోతిని గదా! ఆనాడు కృష్ణా!

# నీ మురళి నాదాలు

నీ మురళి నాదాలు నే వినగ గోపాల!
పరవశము జెంది నే పాట బాడుదునూ!

కలిసిపోజూతు నీ కమ్మనీ గానమున
అణిగిపోజూతు నీ యందాల వేణువున!

నీ మురళి నాదాలు నే వినగ గోపాల
పరవశము జెంది నే పాట బాడుదునూ!

విరహ వేదనచేత తేసారి నా గుండె!
వేయి వ్రక్కలు పగును! విలవిలా తపియింతు!
నిను జేరగా మనసు నిండు గగనమునందు
తారలను దళుకులను దగ నిన్ను వెదుకును!

ఉబుకుచు లుఱికిమిన యటుల మెఱుపు మెరిసిన రీతి
మనసులో వర్ష రు మారుతము లే వీచు!
నను కలువుకోవుగా నలునంత దయజూపి
వినవుగా నా గీతి వీనులకు విందుగా!

ఎన్నాళ్ళు విరహమున జెన్నార దపియింతు!
కన్నీటి కొలనులో గలువలే వ్రాయగా!
నీ మురళిలో గలియ నిండార నాకాంక్ష!
నిజము నేయము కృష్ణ! నెమ్మనముతో కలను!

నీ మురళి నాదాలు నే వినగ గోపాల!
పరవశము జెంది నే పాట బాడుదునూ!

# మలిసంధ్య కాంతులను

మలిసంధ్య కాంతులను మాలతీ లతక్రింద
మది మాట తెలుపగా మాధవా! కాంతా!

ఎన్నెన్నో జన్మలా యేకాంత గీతినీ!
సరిగమలతో పాడ సరసమా కోర్కె!

మలిసంధ్య కాంతులను మాలతీ లతక్రింద
మది మాట తెలుపగా మాధవా! కాంతా!

రంగురంగుల పూల రమణీయ వనవీధి
పిల్లనాగ్రోవి యా పిలుపులను నే వినుచు!
మనసులో నా మాట మర్మముగ తెలుపుచును
నే గీతి పాడగా నిఖిలేశ! నా వాంఛ!

చిలిపి చంద్రుని కాంతి సింగార మొలుకగా!
తళుకు తారల కాంతి తగ ద్యుతి నొలుకగా!
గూటిలో గువ్వ జత కువకువల సందడిని
నా వినతి వినిపింప నాథ! నా కాంతా!

ఎవరు వినరాని దిది! యేకాంత భావమిది!
కలతతో తెలుపునది! కన్నీరు నింపినది!
ఎన్నెన్నో జన్మముల విన్నపం బిది స్వామి!
చెవియందు తెలిపెదను! చేర రాగదవోయి!

మలిసంధ్య కాంతులను మాలతీ లత క్రింద
మది మాట తెలుపగా మాధవా కాంతా!

# అలరి నా వేదనను

అలరి నా వేదనను నాలింపుమో స్వామి!
చిన్ని నా విన్నపము చెల్లింపు స్వామీ!
ఆట పాటలతోని యలరేటి పదము లని
దూరాన నుండకుము దోషిగా భావించి!
అలరి నా వేదనను నాలింపుమో స్వామి!
చిన్ని నా విన్నవము చెల్లింపు స్వామీ!

మధుర భక్తిని నిన్ను మాలిమిని బూజించి
కోకిలకు వలె నిన్ను గూర్మి బాడితినీ!
పతివోలె నిను దలచి సతిగ నిను భావించి
వినయాంజలిని భక్తి వినతి జేసితినీ!

అల గోపికవోలె ఆడిపాడితి నంతే!
గోపికను నే గాను గోపాలుడవు గావు!
అణువణువులో నున్న యల పరంజ్యోతివీ!
అఖిల జీవుల నున్న యాత్మేశ్వరుండవూ!

కైవల్యమును గోరి కాంక్షించి పాడితిని!
చిన్ని నా మనసుతో చిన్నారి మాటలను!
తప్పులని భావించి తగ దూర ముంచెదో
కరుణతో మది జేర్చి కైవల్య మిచ్చెదో!




